# ఆంధ్రపత్రిక



The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 36 No. 22 SATURDAY 23rd APRIL 1949 వెల ఒకఅణా { Founder: K. Nageswara Rao

# బ్రిటిష్ ప్రధాని అట్లీతో పండిట్ నెహ్రూ దీర్ఘసంభాషణలు

## 'నాన్కింగ్‌ను ముట్టడించండి'

### సేనలకు కమ్యూనిస్టు నాయకుల ఆదేశం

చైనా కమ్యూనిస్టు నాయకుడు మావో సీటుంగ్

నాన్కింగ్, ఏప్రిల్ 21: చైనా కమ్యూనిస్టుపార్టీ అధ్యక్షుడు మావ్ సీటుంగ్, కమ్యూనిస్టు సర్వసేనాని చూతే, నేటి ఉదయం అన్నిరంగాల్లోనూ ఉన్నతమ సేనానులకు 'ధైర్యంగా ముందుకు సాగిపోయి నాన్కింగ్‌ను చుట్టు ముట్టండి' అని ఆదేశమిచ్చారు. ఆ ఆదేశానికి అనుగుణంగా 3 వేలమంది కమ్యూనిస్టు సైనికులు 100 ఫిరంగులతో నాన్కింగ్‌కు 60 మైళ్లు ఎగువగావున్న వూహూ దగ్గర విజృంభించి నదిని దాటిరి. వారు దక్షిణతీరంలో ఉన్న ప్రభుత్వ స్థావరాలను ధ్వంసం చేసి పరిసరాల్లో ఉన్న పర్వత స్థావరాల నాక్రమించుకొనిరి.

అసలు 5 వేలమంది నదినిదాటటాని ప్రయత్నించారని తెలుస్తున్నది. నదివద్దర పోరాటంలో చనిపోయిన సైనికుల శరీరాలూ, పగిలిపోయిన పడవలూ నది ప్రవాహంలో కొట్టుకునిపోతూ దిగువ ప్రాంతాల్లో కనిపించినవి. నాన్కింగ్ షాంఘై రంగంలోని ప్రభుత్వసేనాని జనరల్ టాంగెన్‌పో యాంగ్‌సీ దక్షిణతీర రక్షణలను నిలపటానికై వూహూ రంగానికి పరుగెత్తుకునివెళ్లి స్వయంగా సేనలను నడుపుతున్నాడు. వూహూలో కమ్యూనిస్టులు దక్షిణతీరాన తమ నెలకొల్పిన స్థావరాన్ని విస్తృతపరచటానికి ఈరాత్రి పెద్దదాడి చేయగలరని భావించపడుతున్నది.

నాన్కింగ్ ప్రభుత్వం కమ్యూనిస్టులు ప్రతిపాదించిన సంధిషరతులను నిరాకరించుటచే ఏక్షణంలోనైనా 1000 మైళ్లు పొడుగున ఉన్న యాంగ్‌సీ రంగమంతా ఒక్కసారి భగ్గుమనవచ్చునని ఎదురుచూస్తున్నారు. యాంగ్‌సీనదిని అంతటా కమ్యూనిస్టులు నిర్విఘ్నంగా దాటకలిగితే మధ్య, దక్షిణ చైనాల మీదికి కమ్యూనిస్టులు విజృంభిస్తారు.

కమ్యూనిస్టులు పెట్టిన 24 షరతుల్లోనూ యాంగ్ సీనదిని దాట నివ్వమనటమూ, ప్రభుత్వ సేనలను సంస్కరించ నివ్వమనటమూ, ప్రభుత్వానికి అంగీకారయోగ్యం

(6-వ పేజీ చూడుడు)

## దేశంలో 1951 కి ఆహార స్వయంసమృద్ధి సాధన

### రాష్ట్ర ఆహారమంత్రులసభ కార్యక్రమం

(స్వకీయ విలేఖరి)

ఢిల్లీ, ఏప్రిల్ 21: వివిధ రాష్ట్ర ప్రభుత్వముల తాలూకు ఆహార శాఖా మంత్రుల సమావేశము యీ ఏప్రిలు నెల 30 తేదీని ఢిల్లీలో జరుగును. 1957 సంవత్సరము నుండీయూ విదేశాల నుండి ఆహార ధాన్యములను దిగుమతి చేయుట నిలిపివేసి మనదేశమునకు కావలసిన ఆహారపదార్థములను మనదేశములోనే ఆ నాటికి స్వయం సమృద్ధముగా పండించి సప్లయి చేయుటకు తగిన సాధనోపాయముల గూర్చి చర్చింపబడును. ఈ రాష్ట్రము ఎంత పరిమితి వరకు ఆహార పదార్థముల ఉత్పత్తిని హెచ్చు చేయవలెనో తెలియజేయబడును. ఢిల్లీలోని ఒక పారిశ్రామికుడు సర్ సీతారాంగారు సలహాయిచ్చిన ప్రకారముగా ఇండియా గవర్నమెంటు చేయుటకు ఆలోచించుచున్నది. చిలగడ దుంపలు (గెనుసు గడ్డలు) క్రసెండలం విశేషంగా పండించు నిమిత్తము రైతులకు ద్రవ్య సహాయముచేయదలంచి అందుకై ఒక కోటి రూపాయలను ప్రత్యేకించదలంచుచున్నది. యీ దుంపలపంటను అభివృద్ధి చేయుటకున్ను గోధుమపిండిలో నిర్బంధవిధిగా యితర రకముల పిండిని కలుపుటకును, ఒక స్కీము తయారు చేయబడెను. యీ స్కీమును అమలుపరచుటకు ఒక వ్యవహార నిర్వహణసంఘము నియమింపబడును. ఏస్కీమును అమలుపరచినప్పటికీ, కమ్యూనిజం మాత్రం అందువల్ల వ్యాప్తి చెందదని ఇండియా గవర్నమెంటు వారి అభిప్రాయం—బీహారులోను అస్సాంలోను వ్యవసాయ యోగ్యమైన బంజరుభూమి అపారంగా ఉంది. ఆ ప్రాంతములను సాగుచేయిస్తే దేశానికి కావలసిన పంట [illegible] కలదని కొందరు సూచించిరి. ప్రస్తుతం దేశానికి కావలసిన పంట ధాన్యములలో నాలుగోవంతు దేశంలో పండుట లేదు. పత్తికి ఉండవలసిన ధరవిషయమున్నూ ధాన్య సేకరణ గూర్చి యీ కూడా చర్చించబడును—దేశంలో ధరలను తగ్గించుటకై అనగా అధికద్రవ్యలాభమును తగ్గించుటకై ఇండియా గవర్నమెంటు వారు ధాన్యముల ధరలను తగ్గింపదలంచిరి. రానున్న పంటధాన్యమునకు ఏ ధర ఉంచవలెనో చర్చించెదరు. నరకుగల ధర కూడా చర్చించబడును—నేరకు పంటగల భూమిలో కొంత భాగమును ధాన్యం పండించుటకు వినియోగించవలెనని గవర్నమెంటు వారి సంకల్పము. పత్తిని పండించే భూమిలో ఎంతభాగమును ఆహారధాన్యపు పంటలకు ప్రత్యేకించవలెనో నిర్ణయింప

ఆహారసమస్యకు మూల కందమైన విషయము ధాన్యసేకరణ. ధాన్యపు ధరలను హెచ్చు చేయించి రైతులకు తృప్తిపరచుటకు రాష్ట్రీయ ప్రభుత్వముల మంత్రి వర్గములు ప్రయత్నించు చున్నవి. రైతులను ఆ విధంగా తృప్తిపరచుట మూలంగా రాగల ఎన్నికలయందు వోట్లు సంపాదించవచ్చునని యీ తంత్రము చేయుచున్నారు. ఆ విధంగా రైతులను బుజ్జగించు చుండుట వల్ల రైతులు తమ యిష్టమైన ధరలకు ధాన్యం అమ్ముటకు అలవాటు పడుచున్నారు. ఈ సమావేశములో చేయబడు నిర్ణయములు రాష్ట్రీయ ప్రభుత్వములకు విధాయకము లగును. ఏ మైనప్పటికీ 1951వ సంవత్సరాంతానికే విదేశీధాన్యం దిగుమతి నిలిపి వేయబడును. కనుక రైతును తృప్తిపరచుటకు ధాన్యం ధరలను నిర్ణయించడం పద్ధతి అప్పుడు పూర్తిగా అంతరించిపోవును.

## కొన్ని షరతులపై ఇండొనీసియా రిపబ్లికన్ ప్రభుత్వ పునరుద్ధరణకు డచ్చివారి సమ్మతి

బటేవియా, ఏప్రిల్ 21: కొన్నిషరతులపై ఇండొనీసియా రిపబ్లిక్ ప్రభుత్వాన్ని తిరిగీ తన రాజధాని జోగ్జకర్తాకు వెళ్ళనిచ్చుటకు డచ్చివారు నేడు అంగీకరించారు. బటేవియాలో నేడు ఉభయ పక్షాలకూ జరిగిన సంప్రదింపుల ఫలితంగా ఈకింది షరతులమీద డచ్చివారు పై అంశానికి అంగీకరిస్తారని నేడు అధికారరీత్యా ప్రకటించబడినది.

(1) రిపబ్లికన్ ప్రభుత్వం తమ అనుచరులకు గెరిల్లాయుద్ధం ఆపమని ఆదేశించి శాంతిని నెలకొల్పటంలో డచ్చివారితో సహకరించాలి.

(2) హేగ్‌లో [illegible] టేబుల్ సమావేశం ఎప్పుడు జరపవలెననీ, ఏ విషయాలపై జరపవలెననీ ఒక సమాధానానికి రావాలి.

రిపబ్లికన్ ప్రభుత్వ పునరుద్ధరణ విషయంలో డచ్చివారు ప్రతిపాదించుచున్న యీ షరతులనైన రిపబ్లికన్ ప్రతినిధులు తమ నాయకులను సంప్రదించగనున్న సమావేశంలో తెలియజేస్తారని రిపబ్లికన్ ప్రతినిధివర్గ నాయకుడు డాక్టర్ రూమ్ తెలుపుచున్నాడు.

ప్రస్తుతి సంప్రదింపులు తొమ్మిదిగి జోగ్జకార్తాకు వెళ్లే విషయమై మాత్రమేనని రిపబ్లికన్ ప్రతినిధులు అన్నారు.

జోగ్జకార్తాను డచ్చివారు ఇప్పటికి 4 మాసాలక్రిందట పోలీసుచర్యలచే స్వాధీనంచేసుకున్నారు.

రిపబ్లిక్ ప్రభుత్వాన్ని పునరుద్ధరించే విషయంలో, రిపబ్లికన్ ప్రతినిధులు మున్నటి శనివారంనాడు ప్రతిపాదించిన అభిప్రాయములనుగూర్చి యేవ్యాఖ్యానమూ చేయటానికి డచ్ ప్రతినిధి డాక్టర్ వాన్‌రోయిన్ నిరాకరించాడు. కాని యీ పునరుద్ధరణ కార్యక్రమవిషయంలో ఉభయ పక్షాల మధ్యనూ తీవ్రమైన అభిప్రాయభేదం వున్నట్లు అభిజ్ఞవర్గాలవల్ల తెలుస్తున్నదట.

సర్వస్వతంత్ర స్వతంత్రమైన సార్వభౌమత్వము కావాలని రిపబ్లికనులు కోరుతున్నట్టున్నూ, ఇందుకు డచ్చిప్రభుత్వం అంగీకరించలేదని డచ్ ప్రతినిధులు తెలియజేసి

(6-వ పేజీ చూడుడు)

## కామన్వెల్తు సమావేశారంభానికి పూర్వం ప్రధానుల ఇష్టాగోష్ఠి చర్చలు

### లండన్‌లో భారతప్రధానమంత్రి నిర్విరామ కార్యక్రమం

భారత ప్రధానమంత్రి నెహ్రూ

బ్రిటిష్ ప్రధాని అట్లీ

లండన్, ఏప్రిల్ 21: కామన్వెల్తు భవిష్యత్ స్వరూప సంబంధాలపై ప్రధానుల సమావేశం బ్రిటిషు ప్రధాని అధికార నివాసమైన 10 డౌనింగువీధిలోని మంత్రివర్గసభ మండపంలో 22 వ తేదీ ఉదయం 11 గంటలకు (భారత కాలమానం ప్రకారం సాయంత్రం 4-30 గం॥కు) ప్రారంభ మవుతుంది. దీనికి కావలసిన ఏర్పాట్లన్నీ నేడు పూర్తిఅయినవి.

బ్రిటిషుప్రధాని అట్లీ అధినివేశ ప్రధాను లందరితోనూ నేడు తొలిచర్చలుజరిపి సభాస్థలికి కావలసిన హంగులన్నిటినీ పూర్తి చేశాడు. భారతప్రధాని నెహ్రూతో అట్లీ నేడు దాదాపు 95 నిమిషాలసేపు సంప్రతించారు. ఇక్కడ సర్వత్రా ఒక విధమైన నిబ్బరమూ, ఆశాభావమూ గోచరిస్తున్నది.

వివిధ అధినివేశాల ప్రధానులూ అంతరంగిక సంప్రతింపులు జరపుతుంటున్నారు. నేడు బ్రిటిష్‌ప్రధాని చేసిన సన్మానసందర్భంలో వీరందరూ కలుసుకోడానికి వీలైనది. ఈ సన్మానంలో భారత ప్రధాని నెహ్రూ, దక్షిణాఫ్రికా ప్రధాని డా॥ మలాన్‌గారలు తొలిసారిగా ఒకరి నొకరు కలుసుకోవడం జరిగినది.

## హంగరీ బల్గేరియాల పై చర్చ జరపాలని బెల్జియం ప్రతిపాదన

### హంగరీకి రష్యా సమర్థింపు.

లేక్ సక్సెస్, ఏప్రిల్ 21: హంగరీలో జరిగిన కార్డినలు మిండ్జెంటీ విచారణ పైనను, బల్గేరియాలో జరిగిన 15మంది ప్రాటెస్టెంటు పాదరీల విచారణ పైనను నేడు జరిగిన చర్చలో రష్యా ప్రతినిధి జేకబ్ మాలిక్ హంగరీ, బల్గేరియా ప్రభుత్వాలను సమర్థించుచూ హంగరీలో మత స్వాతంత్ర్యం లేక పోలేదనీ, మిండ్జెంటీని గాని 15 మంది పాదరీలను గాని విచారించింది మత దుష్ప్రవర్తనకు గాక దేశభద్రతకు విరుద్ధంగా ప్రవర్తించినందుకనీ అన్నాడు.

ఐక్యరాజ్యసమితిలో హంగరి బల్గేరియాలకు ప్రవేశం నిరాకరించాలని కొలంబియా, కోస్టారీకాలు ప్రతిపాదించినవి. ఈవిషయాన్ని రాగల సెప్టెంబరు సమావేశంలో చర్చించాలని బెల్జియంచేసిన తీర్మానాన్ని చైనా, సాల్వడారు, కొలంబియాలు బలపరచినవి. ఈమతగురువుల విచారణలకుముందు నడచిన విషయాలు గోప్యంగా ఉంచడంమాస్తే ముద్దాయిలు క్రూరమైన చర్యలకు గురిఅయిఉండవచ్చునని భావించడానికి అవకాశంఉందని లెబనాన్ ప్రతినిధిఅన్నాడు. చర్చ రేపటికి వాయిదాపడింది.

## అట్లీ క్రిప్సులతో నెహ్రూ సంప్రతింపులు

లండన్, ఏప్రిల్ 21: రేపు ప్రారంభం కానున్న కామన్వెల్తు ప్రధానుల సమావేశంలో ముఖ్య పాత్రధారి అయిన పండిత నెహ్రూ ఈ వేళ మధ్యాహ్నం బ్రిటిష్ ప్రధాని అట్లీని కలుసుకుని దీర్ఘకాలం సంభాషణ జరిపెను. ఇంతటితో బ్రిటిష్ ప్రధాని ఇప్పటి వరకూ కామన్వెల్తు ప్రధానులతో విడివిడిగా జరుపుతున్న తొలి సంప్రదింపులు పూర్తి అయినవి. ఈ సంప్రదింపులు కామన్వెల్తు ప్రధానులకు వివిధ విషయములను తెలుసుకొనుటకు చాల ఉపకరించెను.

భారతప్రధాని నెహ్రూ నేటి ఉదయం బ్రిటిష్ ఖజానామంత్రి సర్ స్టాఫర్డ్ క్రిప్సును కలుసుకొని మాట్లాడెను. ఆ తరువాత క్లారిడ్జెస్ హోటలుకువెళ్లి కెనడా విదేశాంగమంత్రీ, కామన్వెల్తు సమావేశంలో కెనడా ప్రతినిధీ అయిన లెస్టర్ పియర్సన్‌తో అల్పాహారమును స్వీకరించుచూ కొంతసేపు సంభాషించెను.

నిన్నరాత్రి లండన్‌చేరుకున్న కొద్దిసేపటికి పండితనెహ్రూ లార్డ్‌మౌంట్‌బాటన్ ఇంటికెని ముందు తెలియజేయకుండా ఆకస్మిక సంతోషాన్ని కలుగజేయుటకై సందర్శించెను. లార్డ్‌మౌంట్‌బాటన్ ఈవేళనే కొన్ని గంటలకిందట మాల్టానుండి ఇక్కడకువచ్చెను. ఆయన మాల్టాలోని బ్రిటిష్‌నౌకాదళానికి అధిపతిగా ఉన్నాడు.

నేడు వేలకొద్దీ ప్రజలు బ్రిటిష్ ప్రధాని నివాసభవనం వెలుపల చేరి కామన్వెల్తు ప్రధానులను చూచుటకై వేచి ఉన్నారు. అందరికన్నా ముందు భారత ప్రధాని నెహ్రూ నల్లసూటు, టోపీధరించి కోటుకాలర్‌లో ఎర్ర కార్నేషన్ పువ్వును పెట్టుకుని అక్కడకు వచ్చాడు.

భారత జాతీయ పతాకం ఎగురుతున్న పండిత నెహ్రూకారు బ్రిటిష్ ప్రధాని నివాసభవనానికి వచ్చేటప్పటికి దాదాపు 12 గంటలయింది. పండిత నెహ్రూతోపాటు బ్రిటన్‌లో భారత హైకమిషనర్ కృష్ణమీనన్ కూడా ఉన్నాడు. ఫోటోలు తీయటం అయినతరువాత ఆయన ప్రజలను అభినందిస్తూ చేయిని ఆడించి లోపలకు వెళ్ళిపోయినాడు.

పాకిస్తాన్‌ప్రధాని ఇంతకుముందేవచ్చి అట్లీతో సంభాషిస్తున్నాడు. పండిత నెహ్రూగారుతరవాత సీగం లియాకతాలీ

(6-వ పేజీ చూడుడు)

## విదేశాలకు సైనిక సామగ్రి

### 140 కోట్ల డాలర్లవ్యయాన్ని అమెరికా భరించాలి

విదేశాంగమంత్రి డీన్ అచిసన్ ప్రకటన

వాషింగ్టన్, ఏప్రిల్ 21: విదేశాలకు సైనికసామగ్రిని సప్లైచేసేందుకు 140 కోట్లడాలర్ల వ్యయాన్ని అమెరికా భరించవలసిఉంటుందని, అమెరికా విదేశాంగ మంత్రిడీన్‌అచిసన్ నేడు సెనెట్ విదేశాంగ వ్యవహారసమితికి చెప్పినట్లు, సమితి సభ్యుడొకడు వెల్లడించెను. ఈ 140 కోట్ల డాలర్ల వ్యయంతోకూడిన సైనికసహాయపు బిల్లు తయారుచేయబడుతున్న దనికూడాఅచిసన్ చెప్పాడట. ఈ 140 కోట్ల డాలర్ల మొత్తం మొదటిసంవత్సరం వ్యయంమాత్రమేనని, సమితిసభ్యులంటున్నారు.

## మాండలేలోని తిరుగుబాటుదార్లకు బర్మా ప్రభుత్వ సేనల శ్రీముఖం

### "తక్షణం నగరం ఖాళీ చేయండి; లేదా పరిసరాల్లోకి వచ్చిపోరాటానికి సిద్ధంకండి"

రంగూను, ఏప్రిలు 21: మాండలేను 48 గంటలలో విడిచిపొమ్మని ప్రభుత్వసేనలు చేసిన సవాలుకు తెల్లముతా తిరుగుబాటుదార్లు ఇంకా సమాధానం ఇవ్వలేదు.

సాధారణ పౌరులకు అపాయం కలగకుండా ఉండగలందులకై ఇవ్వబడిన ఈ గడువు అయిపోయింది. తెల్లముతావారిని పట్టణం బయటికి వచ్చి యుద్ధం చేయవలసిందనీ, లేదా నిర్మూలనాన్ని ఎదుర్కొనవలసిందని హెచ్చరిక ఇవ్వబడింది.

తిరుగుబాటుదార్లు యుద్ధానికి రావచ్చుననీ, సాధారణపౌరుల దుస్తులు ధరించి పట్టణంవిడిచి పోవచ్చుననీ ఒక అధికారి అన్నాడు.

రంగూనుకు ఉత్తరంగా 10 మైళ్ళలో ఉన్న ఇన్సీను వద్ద యుద్ధతీవ్రత తగ్గింది. కారణం ఏమంటే తిరుగుబాటుచేసిన కరేనుల కార్యకేంద్రం పై లొంగుబాటు చిహ్నంగా తెల్లజెండా ఎత్తబడింది.

కరేనులందరూ లొంగుబాటుకు సంసిద్ధులైవున్నారో లేక ఒక్క రంగంలో వారుమాత్రమే లొంగుబాటు చేస్తున్నారో ప్రభుత్వసేనలు ఆరా తీస్తున్నారు.

కరేనులతో ప్రభుత్వం నడిపిన శాంతి సంభాషణలు ఏప్రిలు 8న విఫలంకాగా వారిపై ప్రభుత్వం దాడి ఆరంభించింది. ఇన్సీను పట్టణం మధ్యగల జైలు పరిసరాల్లో కరేనులు స్థావరాలు ఏర్పాటు చేస్తున్నారని తెలుస్తున్నది.

రంగూనుకు ఉత్తరంగా 90 మైళ్లలో ఉన్న రైల్వే కేంద్రపట్టణం న్యాన్‌గ్లెబిన్ వద్ద నిన్న చాలా రాత్రివరకూ యుద్ధం సాగింది. ఈ పట్టణాన్ని పట్టుకోనడానికి అనేక వందలమంది కరేనులు ఆయుధవాహనాలు ముందుంచుకొని సోమవారం నుంచీ అనేక ప్రయత్నాలు చేశారట. ప్రభుత్వసైన్యాలు విమానాల సహాయంతో ఈ దాడులను గట్టిగా నిరోధిస్తున్నారట. ఇప్పటికి 150 మందికిపైగా కరేనులు చచ్చిపోయినారట, ఇంకా అనేకమంది గాయపడ్డారట. యుద్ధం జరుగుతూన్న కాలంలో కరేనులు చుట్టుపట్లగల అనేక గ్రామాలను తగులబెట్టారట.

మధ్య బర్మాలో కమ్యూనిస్టులు నిలిపి ఉంచిన 200 మంది కాందిశీక భారతీయులను, బర్మాసైనికులు19 తేదీన విడిపించారట. ఈ భారతీయులు తొంగూ అనే కరెను స్థావరంనుంచి రంగూనుకు పోతూ ఉండగా న్యాంగ్లెబిన్‌వద్ద కమ్యూనిస్టులు వారిని ఆపారట. ప్రభుత్వసేనలు కమ్యూనిస్టులను తరిమివేసి భారతీయులను ప్యంతా అనే చోటికి చేర్చారట.

## గంటల పంచాంగం

విరోధి సం॥ చైత్ర బ॥ ఏకాదశి 1949 సం॥ ఏప్రిల్ 23 శనివారం న. ఏకాదశి రా 8.50 శత రా11.11 వర్జ్యం ఉ 6.7 కు.

బ॥ ద్వాదశి ఏప్రిల్ 24 ఆదివారం ఆ॥ ద్వాదశి 24.0 పూభా రా 2 19 వర్జ్యం ఉ 6.25 ల 8.13 కు.

ఆంధ్రపత్రిక

విరోధి సం॥ చైత్ర బ॥ ఏకాదశి శనివారం

## ఆంధ్రరాష్ట్రనిర్మాణం

భాషారాష్ట్ర నిర్మాణముపై కాంగ్రెస్ అగ్రనాయకత్రయ నివేదికను కాంగ్రెస్ కార్యవర్గము ఆమోదించిన అనంతరము డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు, ఆంధ్ర రాష్ట్ర సత్వరనిర్మాణమునకు దగ్గర దారిని చూపుచు అనేక ప్రకటనములను చేసియుండిరి. చెన్నగరముపై ఆంధ్రులు తమ హక్కును శాశ్వతముగ వదులుకొనినగాని ఇంతలో ఆంధ్రరాష్ట్రమేర్పడగల యవకాశము లేదని విస్పష్టము చేసిరి. అట్లే ఇతర సరిహద్దుల విషయమునకూడ సంశ్లిష్టముగ నున్న ఇతర భాషాప్రాంతములవారితో సమాధాన పడవలసి యుండునని హెచ్చరించిరి. మొన్న పత్రికావిలేఖకుల సమావేశము నందు పట్టాభి సీతారామయ్యగారీ విషయములను సమగ్రముగ చర్చించి యున్నందున, కొన్ని సందేహములు నివృత్తి అయినవిగాని, మరికొన్ని క్రొత్త సందేహములు ఉత్పన్నమైనవి.

బళ్లారిజిల్లా విషయమున కేల్కారు తీర్పు ఖాయమైనట్లు, ఆ ప్రకారము సరిహద్దులు ఒక ప్రత్యేక విచారణసంఘముద్వారా నిర్ణయము అయినను, కాకపోయినను, ఆంధ్రరాష్ట్రమునకు బళ్లారి జిల్లాలోని ఆదోని, ఆలూరు, రాయదుర్గము తాలూకాలు మాత్రమే చెందునని స్పష్టమైనది. చెన్ననగరము విషయమునకూడ అట్టి తీర్పే గలదు. ఉత్తర దక్షిణమద్రాసులు ఆంధ్ర, తమిళ భాగములుగ అంగీకరింపబడి యుండెను. కాని ఇపుడు నగరముపై హక్కును వదులుకొనుటవలన, నగరము ఉత్తరపు సరిహద్దునుండి ఆంధ్రప్రాంతము ప్రారంభమగునా? ఆంధ్ర, తమిళ రాష్ట్రముల సరిహద్దుల నిర్ణయము జరుగువరకు చిత్తూరు, నెల్లూరు జిల్లాల సరిహద్దులే ఆంధ్ర, తమిళ సరిహద్దులుగ నుండునా? ఈ విషయము మొన్నటి పత్రికావిలేఖకుల సమావేశమునందు కాంగ్రెసు అధ్యక్షుడు స్పష్టము చేసియుండలేదు. చెన్ననగరము ఆంధ్ర, కర్నాటక సరిహద్దుల విషయములో వలెనే ఆంధ్ర, తమిళ సరిహద్దుల విషయముకూడ కొంతకాలమైన విమ్మటకూడ ఆంధ్ర-ఉత్కళ సరిహద్దులవలె పునరాలోచించుటకు అవకాశము లేదని డాక్టరు పట్టాభిగారు భావించుచుండిరి తెలంచుట కవకాశము కల్గుచున్నది. కాని చెంగల్పట్, ఉత్తర ఆర్కాటు జిల్లాలందు ఆంధ్రులు అధిక సంఖ్యాకులుగ నున్న ప్రాంతములు ఆంధ్రరాష్ట్ర 'నేటి హద్దులో' ను అనుకొనియే యున్నందున, ఆభాగములుకూడ సమగ్రాంధ్రరాష్ట్రమున చేరుట సహజము. చెన్ననగరముతోపాటు ఈ ప్రాంతములపైకూడ ఆంధ్రులు తమ హక్కులను వదులుకొనవలెనను వాదన ఎంతమాత్రము సమర్థనీయము గాదు. ఆ విధముగ ఈ ప్రాంతములు తమిళరాష్ట్రములో చేరిపోవుటను ఆంధ్రులు ఎన్నటికి సమ్మతింపరు.

ఇన్ని త్యాగములు చేసినను, పట్టాభి సీతారామయ్యగారు మొన్న తెలిపిన ప్రకారము 1950 ఏప్రిల్ నాటికి గాని ఆంధ్రులకు 'ఒక రాష్ట్ర ప్రభుత్వము' అంటు ఏర్పడునట్లు కన్పింపదు. అప్పటికైనను ఏర్పడక పోవచ్చునని, నూతన రాజ్యాంగమును అనుసరించి ఎన్నికలు జరిగిన అనంతరమె ప్రత్యేక ప్రభుత్వము ఏర్పడునని కూడ కాంగ్రెసు అధ్యక్షుని వివరణ స్ఫురింపచేయు చున్నది. రెండు, మూడు సంవత్సరముల తరువాత రాష్ట్రము రాగలదను ఆశతో చెన్ననగరమును, చెంగల్పట్, ఆర్కాటు జిల్లాలలోని ఆంధ్రప్రాంతములను ఆంధ్రులు వదులుకొనవలెననుట సమంజసము గాదు.

రాష్ట్ర శాసనసభలు ఇదివరకు అనేక పర్యాయములు రాష్ట్ర విభజనను కోరుచు తీర్మానించి యుండెను. రాష్ట్ర మంత్రివర్గము కూడ రెండు సంవత్సరముల క్రితము సిఫార్సు చేసియుండెను. అది నాల్గు భాషాప్రాంతములకు సంబంధించి యున్నందున ప్రత్యేకము ఆంధ్ర ప్రాంతమును గురించి తిరిగి సిఫార్సు చేయవలసిన అవసరము కలిగియుండవచ్చును. తమ ప్రతిపాదనలకు "తమిళ మిత్రులు" సమ్మతించిరని డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు ప్రకటించియుండిరి. కనుక రాష్ట్రమంత్రివర్గము ఏ క్షణమునైన సమావేశమై అట్టి తీర్మానము చేయవచ్చును. వారట్లు చేయుటకు శాసనసభల కాంగ్రెస్ పక్షము ఒక తీర్మానము చేయవలసిన అవసరము వుండదని చెప్పవచ్చును. కేంద్ర ప్రభుత్వము, కాంగ్రెసు కార్యవర్గము తీర్మానమును పురస్కరించుకొనియె ఈ రాష్ట్ర మంత్రివర్గాభిప్రాయమును ఈ సరికి అడిగియుండవచ్చును. అందుపైనను మంత్రివర్గము నిర్ణయము చేసి కేంద్ర ప్రభుత్వమునకు తెలుపవచ్చును. అందుపై గవర్నరు జనరలు భారత ప్రభుత్వచట్టము 290 సెక్షను ప్రకారము ఉత్తరువు చేయవచ్చును. ఈ పని పూర్తియగుటకు ఎంతో వ్యవధి అవసరము లేదు. సరిహద్దులు ఇంచుమించు నిర్ణయమైనవి. గనుక, ఇంక ఆస్తి అప్పుల పంపకము మాత్రమె మిగిలి యుండును. మూడు మాసముల వ్యవధిలో ఈ కార్యకలాపము పూర్తి కాగలదు. జూన్ 3 వ తేదీన దేశ విభజన నిర్ణయము కాగా ఆగస్టు 15 వ తేదీ సరికి విభజన కలాపము యావత్తు పూర్తియై యుండెను. దేశము మొత్తము విభజన, రెండు రాష్ట్రముల విభజన రెండు మాసములలో పూర్తియైనపుడు 11 జిల్లాలను వేరుచేయుట మూడు మాసములలో అసాధ్యమనుటకు వీలులేదు.

నిర్ణయము జరిగి, ఆ నిర్ణయము అమలు జరుగుటలో కాలహరణము జరిగిన ఎట్టి ప్రమాదములు రాగలవో దేశవిభజన చరిత్రయే స్పష్టము చేయుచున్నది. ఆస్తుల అపహరించుటకు, అన్యాక్రాంతము చేయుటకుకూడ ప్రయత్నములు జరిగియున్న సందర్భములను ఆంధ్ర నాయకులు విస్మరింపరాదు. 1949 ఆగస్టు 15 వ తేదీసరికి ప్రత్యేక ప్రభుత్వముతో ఆంధ్రరాష్ట్రము ఏర్పడక 1951 లోగాని 52 లోగాని ఎన్నికలు జరుగువరకు ఇంచుమించు ఇప్పటి పరిపాలన ఏర్పాట్లే అమలునందుండవలెనన్న, చెన్ననగరము, సరిహద్దులవిషయమై ఇంతటి తొందర అవసరములేదు. సరిహద్దుల నిర్ణాయక సంఘమేర్పడి అన్ని సమస్యలు న్యాయముగ పరిష్కారమగువరకు ఆంధ్రులు తమ హక్కులను వదులుకొనవలసిన అవసరము లేదు. ఆవిధముగ వదులుకొనుట అనివార్యము. అవసరము అయిన 1949 ఆగస్టు 15 నాటికి ప్రత్యేక ప్రభుత్వ మేర్పడవలెనని పట్టుబట్టవలెను. కాంగ్రెస్ అధ్యక్షుడు డాక్టరు పట్టాభిగారు ఈ విషయమున ప్రత్యేక శ్రద్ధ వహించి వివిధవర్గముల సంఘటితపరచి పని చేసిన ఇది అసాధ్యము గాదనియే ఆంధ్రుల విశ్వాసము.

## "ఏమిచెయ్యడానికీ పాలుపోకుండా ఉన్నది"

### ప్రముఖ ఆంధ్ర నాయకుని అభిప్రాయము

చెన్నపట్నం, ఏప్రిల్ 22: పట్నం వదులుకుంటేనేగాని రాష్ట్రంరాదు. అన్నమాట మింగడానికీ వీలులేకుండా ఉంది. కక్కడానికీ వీలులేకుండా ఉన్నది. పట్నంపై హక్కు వదులుకుంటామూ ఇన్నాళ్లు మనచేసిన పోరాటం ఏమిగాను? పట్నం వదులుకోవడం - అసలు రాష్ట్రమే రాదుగదా భాగ్యం!" అని ఒక ప్రముఖ ఆంధ్రనాయకుడు నాయకత్రయ నివేదికపై తన అభిప్రాయము తెలుపుతూ చెప్పిరి. తామీ నివేదికను అంగీకరించినారా అనగా అంగీకరించారని అన్నవారెవరు అని ఆ నాయకుడు అన్నారు. ఆంధ్రశాసన సభ్యులు, నాయకులు ధైర్యంగా ఏదో ఒక నిర్ణయము చేసుకోవలసిన పరిస్థితి సమయము ఇది అన్నారు.

### రాష్ట్రపతితో ప్రముఖుల చర్చలు

రాష్ట్రపతి భోగరాజు పట్టాభి సీతారామయ్యగారితో ఆంధ్రరాష్ట్ర నిర్మాణము ఇత్యాది సమస్యలు బెజవాడ గోపాలరెడ్డిగారు సుమారం మధ్యాహ్నం చర్చచేసిరి. శ్రీ మల్లిపూడి పళ్లంరాజుగారు రాత్రి పట్టాభిగారిని దర్శించి రాష్ట్రసమస్య మున్నగు విషయములను మాట్లాడిరి.

## చెన్నపట్నం లేకుండా రాష్ట్రానికి ఒప్పుకోరాదు

### చిత్తూరుజిల్లా కాంగ్రెస్ కార్యవర్గ తీర్మానం

మదనపల్లి, ఏప్రిల్ 20: చెన్నపట్నం లేకుండా రాష్ట్రం ఏర్పాటును ఆంధ్రులు అంగీకరించరాదని చిత్తూరుజిల్లా కాంగ్రెస్ కార్యవర్గం కుప్పంలో సమావేశమై తీర్మానించారు. సమావేశానికి ఆర్. వెంకటరెడ్డిగారు అధ్యక్షత వహించారు.

మదనపల్లి యువజన సంఘ కార్యవర్గంవారు, ఆంధ్రరాష్ట్ర నిర్మాణం విషయమై నాయకత్రయ సంఘ నిర్ణయానికి అనంగీకారం, వ్యక్తపరుస్తూ, ఆంధ్రులు భవిష్యత్తు దృష్టిలో వ్యవహరించాలని సూచిస్తూ ఒక తీర్మానం చేశారు, వా. త్రి. సంఘ నిర్ణయం అంగాలు లేని మొండెంవలె వున్నదని వారు అభిప్రాయం తెలుపుతున్నారు. (అ. ప్రె)

## గ్రామ సంఘానికి గ్రాంటు

మద్రాసు, ఏప్రిల్ 20: గ్రామస్థుల సాంఘికోపయోగాలకు సమావేశం కొరకు ఉపయోగించే కేంద్రాన్ని నిర్మించడానికై మద్రాసు ప్రభుత్వం కొలిక్కాం క్రితం చిత్తూరుజిల్లాలోని పర్ల రేవులు గ్రామసంఘానికి రెండువేల రూపాయల గ్రాంటు నిచ్చింది.

ఒంగోలుకు దగ్గరలోని గ్రామ ఉద్యోగాలలో గ్రామ సంఘం అప్పుడే భవన నిర్మాణాన్ని ప్రారంభించినదని తెలుస్తున్నది. గ్లోబ్

## ఉరిశిక్షపడినఖైదీ శ్రీమన్నారాయణపరారీ

### రిజర్వుపోలీసులతోసహా 6 గురిపై ఛార్జిషీటు

ఏలూరు, ఏప్రిల్ 19: "క్రాంప్టేట్స్ హోటల్" హత్యకేసులో మరణశిక్ష విధింపబడిన అల్లూరి శ్రీమన్నారాయణ పరారి సందర్భంలో ఏలూరు పోలీసువారు, పరారీకి కారణభూతులైన వారం దరిమీద స్థానిక సబుమేజిస్ట్రేటుకద్ద ఛార్జీషీటు దాఖలు చేశారు.

చార్జిషీటులో అల్లూరి శ్రీమన్నారాయణ, అంకే గోపయ్య (నం. 937 రిజర్వు కాన్స్టేబిల్), దాసరి హనుమంతరావు (నెం. 917 రిజర్వు కాన్స్టేబిల్), బసవరావు, వెంకటేశ్వరరావు, అల్లూరి బ్రహ్మానందం, (శ్రీమన్నారాయణ అన్న), పూతి వెంకటయ్య (కారు డ్రైవర్), శ్రీరాములు, పేర్కొనబడ్డారు. పీనల్ ఇండియన్ పీనల్ కోడు 222, 224, 225, 201 సెక్షనులు 120-బి సెక్షనుల క్రింద, మరణశిక్ష విధింపబడినవానిని, ప్రభుత్వ ఉద్యోగియైయుండే బుద్ధిపూర్వకముగా వదలివేయుట తప్పుడు రిపోర్టు లివ్వుట, ఈ పనులు చేయుటకు కుట్ర చేయుట మొదలైన నేరములు మోపబడినాయి.

ఛార్జిషీటులో ఈ క్రింది వివరాలు తెలుపబడ్డాయి. మొదటి నిందితుడు శ్రీమన్నారాయణ కృష్ణాజిల్లా అల్లూరుకు చెందిన ప్రముఖ కమ్యూనిస్టు. 28-3-49 తేదీని కృష్ణాజిల్లా సెషన్సుజడ్జీ గారిచే అతనికి మరణశిక్ష విధింపబడెను. 2, 3 నిందితులు కృష్ణా జిల్లా రిజర్వు పోలీసుదళములో కాన్స్టేబిల్సు. అపనిందితుడు అల్లూరి బ్రహ్మానందం శ్రీమన్నారాయణకు అన్న. 7 వ నిందితుడు శ్రీమన్నారాయణ పరారీకి సహాయపడిన కారు డ్రైవరు మిగిలిన ముగ్గురు కమ్యూనిస్టులున్నూ, శ్రీమన్నారాయణకు సహాయపడులు నూ అయియున్నారు.

ఏప్రెలు 3, 4 తేదీలలో రాజమండ్రి జెయిలుకు తీసికొనిపోయే నిమిత్తం తమకు వప్పగింపబడిన ఖైదీ శ్రీమన్నారాయణను, త్రోవలో వదలివేసే నిమిత్తం 2, 3 నిందితులు శ్రీమన్నారాయణతోను, మిగిలిన నిందితులతోను కుట్రచేశారు. ఏప్రెలు 3 వ తేదీ సాయంకాలం శ్రీమన్నారాయణ, ప్రాసిక్యూషను సాక్షి, ఆదివరకే కొద్ది శిక్ష విధింపబడిన అచ్చిరాజున్నూ రాజమండ్రీ జైలుకు తీసికొనిపోబడే నిమిత్తం, 2, 3 వ నిందితులకు వప్పజెప్పబడినారు. వారికి బందరునుండి రాజమండ్రీకి యిందు నిమిత్తం రైల్వే వారంట్లుకూడా యివ్వబడ్డాయి. కాని బందరులో బయలుదేరిన వారు, తరువాత రైయిలులో రాజమండ్రి వెళ్ళక బెజవాడలో దిగి, రాత్రి "క్రాంప్టేట్స్ హోటల్" లో భోజనం చేసి, రాత్రికి సబ్ జైలు లాకప్పులో వున్నారు. మరునాడు 2, 3 నిందితులు శ్రీమన్నారాయణను, అచ్చిరాజును తీసికొని ఉదయం 11గంటల రైలులో రాజమండ్రీ బయలుదేరారు. కాని నేరుగా గోదావరిస్టేషనుకు వెళ్ళక, త్రోవలో మధ్యాహ్నము 1 గంటకు వచ్చు పేట స్టేషనులో దిగి వారనవరకే చేసిన కుట్ర ప్లానుప్రకారము, "తాజ్ మహల్" హోటలులో మధ్యాహ్నము రాత్రి భోజనములు చేసి విశ్రాంతి తీసుకొన్నారు. పెదఅవుటుపల్లినుండే గీరితో అదే రైలులో ప్రయాణం చేసిన 6వ నిందితుడు బ్రహ్మానందం, ఆ సాయంకాలం శ్రీమన్నారాయణ పరారీ నిమిత్తం ఒక కారు కుదుర్చాడు. అతడే వారికి పెట్రోలు సరఫరా చేయించి హోటలునొద్దకు తీసికొనివచ్చాడు. అచటనుండి నిందితులు కారులో బయలుదేరారు. ఏలూరుకు జంక్షన్ దాటి రెండుమైళ్లు వెళ్ళినతర్వాత వీరందరూకలసి ఒక నాటకమాడారు. పర్యవసానము 2, 3 నిందితులు అచటనే ఉండిపోయారు. శ్రీమన్నారాయణ, యితరనిందితులు ఆకారులో పరారీఅయిపోయారు. ఈవిధంగా కుట్ర ఉద్దేశం నెరవేరింతర్వాత 2, 3 నిందితులు తమపై నేరం రాకుండా చేసికొంటానికి భీమవరం పోలీసు స్టేషనుకువచ్చి శ్రీమన్నారాయణ, అచ్చిరాజు లను కట్టడిలోనుంచి, రైలులోనుంచి పారిపోయారని అసత్యమైన రిపోర్టు ఒకటి యిచ్చారు.

నిందితులలో 2, 3 రిజర్వు పోలీసులు, అపనిందితుడు బ్రహ్మానందమూ 7 వ నిందితుడు స్థానిక సెంటయ్య రిమాండులో యున్నారు. మిగతావారు యింకా పరారీలో ఉన్నారు. స్వ. వి.

తే. 23-4-49 శనివారం సాయంత్రం 6 గంటలకు వై. ఎమ్. ఐ. ఎ. మైలాపూర్ బ్రాంచిలో "కృష్ణశక్తి" అను విషయమునుగుర్చి శ్రీ కల్లూరి వీరభద్రశాస్త్రిగారు ఉపన్యసింతురు. న్యా॥ వల్లభనేని సత్యనారాయణరావుగారు అధ్యక్షత వహింతురు.

## మంత్రివర్గ విస్తరణ

### మే 12 వరకు కొత్త మంత్రులు రారు

### ప్రకాశం - పట్టాభిగార్ల సంప్రతింపులు

చెన్నపట్నం, ఏప్రిల్ 22: మంత్రివర్గ విస్తరణనుగూర్చి ఇంకనూ రాయబారములు జరుగుచున్నవి. కొత్తమంత్రులు పదవీ స్వీకరణ మే 12 వ తేదీవరకు జరుగకపోవచ్చునని ఇప్పటి పరిస్థితిని గూర్చి అభిజ్ఞవర్గములవారు తెలుపుచున్నారు. ప్రధాని మంత్రిపదవులు ఇచ్చేదమన్న నల్గురిలో ఇప్పటివరకు ఇద్దరు మాత్రము పదవుల స్వీకరించుటకు అంగీకారము తెలిపినారనియు ఒకటి రెండు రోజులలో మిగతావారు గూడా తెలుపగలరనియు తెలుపుచున్నారు. ఈ లోపల మా కులమునకు మంత్రిపదవి కావలెను. మా కులమునకు మంత్రిపదవి కావలెను అని కొందరు సమూహములుగా రాష్ట్రపతిని చూచి దరఖాస్తులు పెట్టుకొనుచున్నారనియు, కులాలవారీగాక మంత్రిపదవులు సమర్థత, ప్రతిభను బట్టి ఇచ్చెదరని రాష్ట్రపతి సమాధానము ఇచ్చుచున్నారనియు తెలియుచున్నది. ప్రస్తుత పరిస్థితులబట్టి 14 కు మించి మంత్రివర్గము విస్తరించుటకు వీలు లేదనియు, అందువల్ల నల్గురు తప్ప క్రొత్తవారికి స్థానము లేదనియు మంత్రివర్గ సన్నిహిత వర్గములవారి అభిప్రాయము. నిన్న సాయంత్రం కార్యవర్గ నిర్మాణసందర్భమున సాధింపబడిన ఏకగ్రీవజాబితా భవిష్యత్తులో మంత్రివర్గనిర్మాణ వ్యవహారములోగూడా తృప్తికరమైన పరిష్కారమునకు దారితీయగలవని ఇతరవర్గముల వారు తెలుపుతున్నారు. పట్టాభిగారు నిన్న సాయంత్రం ప్రకాశంగారిని దర్శించి చేసిన చర్చలుగూడా సమరససాధనకు తోడ్పడవచ్చు ననుచున్నారు.

రాష్ట్రపతి రాజధానీనగర మున్నతరి చెన్నరాష్ట్రకాంగ్రెసు వ్యవహారములలో 'శిక్షణ' ప్రజాస్వామ్యపద్ధతులు నెలకొన్నవి అని నిన్న సాయంత్రం కాంగ్రెసు వర్గములమధ్య చేకూరిన ఒప్పందమును గూర్చి రాజకీయవేత్త వ్యాఖ్యానం చేసిరి. కార్యవర్గ నిర్మాణము ఒప్పందంపై జరిగిన దాన్నను, రాష్ట్రపతిని "ఈ రాష్ట్రమునకు మంచి రోజులు వచ్చుటకు ఇది శుభసూచన" అని అన్నారు. మంత్రి వర్గ నిర్మాణ సందర్భముల గూడ రాయబారములు సత్వరమే ఫలించుటకు యత్నములు జరుగుచున్నవి.

## మద్రాసు హైకోర్టు నాటకమండలి

మద్రాసు హైకోర్టు నాటకమండలి వారు బుధవారం సాయంత్రం సౌందర్యమహలులో రా॥ నర్లపల్లి నారాయణమూర్తిగారిచే రచింపబడిన 'విరామమలు' అను నాటకమును ప్రధాన న్యాయమూర్తి గౌ॥ పాకాల వెంకట రాజమన్నారుగారి సమక్షమున ప్రశంసనీయముగా ప్రదర్శించిరి. కామశాస్త్రి శ్రీ సుంటూరు వెంకట సుబ్రహ్మణ్యం, సూర్యప్రకాశం - వారిలాల అద్వైత బ్రహ్మశాస్త్రి శంకరరావు- పి. వి. జగన్నాథరావు, వేణు- కె. కృష్ణమాచార్య, పద్మనాభం-ఎల్. ఎం. ఎస్. కృష్ణరావు, డి హైస్కూల్ ప్రిన్సిపాల్, జిల్లా మునసబు - గంటి గోపాలం, సీతమ్మ, కె సీతారామశాస్త్రి, రత్నం - ఎం. కామేశ్వరరావు శారద- కె. వీరాంబగారలు నటించిరి. పాత్రధారులందరు పట్టభద్రులే అగుట ఇందలి విశేషము. ప్రధాన న్యాయమూర్తి నాటకప్రదర్శనమునను తాము ఆనందించినట్లు, కొత్తఅయినను కొందరు నటకులు ఉత్తమస్థాయికి వచ్చిరనియు, కామశాస్త్రి, సూర్యప్రకాశం, వేణు, జిల్లామునసబు పాత్రధారులు అందుకు తార్కాణములనియు చెప్పిరి. ఆధునిక జీవితమును ఇతివృత్తముగ చక్కని నాటకమును రచించవచ్చుననుటకు ఈ నాటకమే సాక్షి అనియు, హైకోర్టు ఉద్యోగులు కళను మరువకుండా కళాప్రియత్వమును నిలబెట్టినందుకు గర్వించుచున్నామనిరి. నాటకప్రదర్శనమునకు వెచ్చి సంఘమునకు కొంతవిరాళమిచ్చెదమని ప్రకటించిరి. ప్రతిపాత్రధారియు యధాశక్తిగ ఉత్తమముగా నటించినందుకు అభినందించిరి.

## కడప కాలెజిలో ఎం. పి. సి. గ్రూపు ఏర్పాటు

కడప, ఏప్రిల్ 21: ఇచ్చటి కళాశాలలో మాథమాటిక్స్, ఫిజిక్స్, కెమిస్ట్రీ గ్రూపు ఏర్పాటుచేయు విషయమై విచారించుటకు విశ్వవిద్యాలయ ఉపసంఘము వచ్చెను. కళాశాల భవనములను, యితర వసతులను పరిశీలించినపిమ్మట వచ్చే జూను నుంచి ఇచ్చట గ్రూపు ఏర్పాటుచేయ వచ్చునని వారు సిఫార్సుచేసిరి. ఈ గ్రూపులో 60 మంది విద్యార్థులకు స్థానముండునని తెలియుచున్నది. (స్వ. వి)

## రాజకీయ బాధితులకు భూముల మంజూరు

### గుంటూరుజిల్లా సభలో ప్రభుత్వ విధాన విమర్శ

తెనాలి, ఏప్రిల్ 19: గుంటూరు జిల్లా రాజకీయ బాధితుల మహాసభ కొంగి విజయరామ రాజుగారి అధ్యక్షతను మొన్న జరిగినది. వివిధ ప్రాంతాల నుండి రాజకీయ బాధితులు సుమారు 200 మంది హాజరయ్యారు. మొదట కొల్లిపరనుపోటేటి కృష్ణమూర్తిగారు రాజకీయ బాధితులకు యీ జిల్లాలో భూములను యివ్వు విషయంలో కలిగిన నిరాశ నిస్పృహను గురించి వివరించారు. దొనపుంత వెంకటప్పయ్యగారు సభను ప్రారంభిస్తూ ప్రభుత్వంవారు ప్రకటించిన రీతిని రాజకీయ బాధితులకు భూముల నిచ్చే విషయంలో జరుగుచున్న ఆలస్యమును చూస్తే యిది ఒక రాజకీయ ఎత్తుగా కనుపించు చున్నదేగాని నిజంగా బాధితులకు భూములను యిచ్చే పరిస్థితి కనుపించుట లేదన్నారు. అధికారవర్గం కరణం, మొదలు జిల్లా కలెక్టరు వరకూ ఈ బాధితుల విషయంలో ఉదాసీనత వహించి వీరిని నిరాదరించుట విచారకరమని, యీ విషయమై సభికుల సాధక బాధకములు ఆలోచించి నిర్ణయించాలన్నారు.

అధ్యక్షుడు విజయరామరాజు నల్లూరి రాజయ్యచౌదరిగార్లు తాము తమతోటి సభ్యుడు చావలి సూర్యనారాయణగారు ను సంవత్సరంపాటు రాజకీయ బాధితుల సలహాసంఘ సభ్యులుగా నుండి చేసిన కార్యక్రమము, అధికారుల అసహాయత, ప్రభుత్వంవారి పరస్పర విరుద్ధమగు జి.వో. లు మొదలగు విషయములను గురించి వివరించారు. జిల్లా కాంగ్రెసు సంఘం సభలలో రాజకీయబాధితుల పట్టీలు యివ్వనందుకు కూడా కాలహరణ మైనదని యీ పరిస్థితిలో తామేమి చేయలేక పోయారనీ, అనువరమని తోచిన వెంటనే ఆ సంఘసభ్యత్వానికి రాజీనామా నిచ్చుటకు సిద్ధంగానున్నామనీ అన్నారు. యలమంచిలి వెంకటప్పయ్య, యడ్లపల్లి కోటయ్యచౌదరి చెరుకు శివరామయ్య చిట్టినేని అచ్చయ్యగార్లు తమ సలహాల నొసంగిన పిమ్మట ఈక్రింది తీర్మానములు గావింపబడెను.

### తీర్మానములు

రాజకీయబాధితులకు భూములను మంజూరుచేయు సందర్భపు జీఓలలో అవసరమగు మార్పులు చేయించుటకును, యీ సంవత్సరమే వెంటనే భూములు యిచ్చునట్లు చేయించుటకున్నూ ప్రభుత్వమునద్దకు రాయబారము వెళ్లుటకు సుగ్గికొండ రామబ్రహ్మం, బొడ్డుపల్లి వెంకటసుబ్బయ్య శర్మ, గోళ్ళమూడి దాసయ్య యార్లగడ్డ శ్రీ కృష్ణయ్య, కొండి వెంకటరత్నం, బండా సుబ్బారావు, డా॥ పసుపులేటి కృష్ణమూర్తి, వల్లూరి కామేశ్వరరావు, కాసు బ్రహ్మానందరెడ్డి (ఎం. ఎల్. ఏ.) గార్లతో ఒక సంఘము ఏర్పాటు చేయబడినది.

గుంటూరుజిల్లా రాజకీయ బాధితుల సలహాసంఘమువారు సిఫారసు చేసిన భూములను ఇతరసంస్థలకు, సొసైటీలకు, వ్యక్తులకు యిచ్చుచున్నట్లు తెలియుచున్నది. అట్లుచేయుట అన్యాయమని ఆ నిర్ణయములను మార్పుచేయించవలెనని ప్రభుత్వమును కోరడమైనది.— శ్రీమతి సరోజనీదేవి, రెంటపల్లి సుబ్బారావు మొదలగువారి మృతికి చింతించుచూ తీర్మానించడమైనది.

### క్రొత్త కార్యవర్గం

నూతన సంవత్సరమునకు అధ్యక్షుడుగ నల్లూరి రాజయ్య చౌదరి, ఉపాధ్యక్షులుగ పుతుంబాక శ్రీరాములు, యనమదల సంకటప్పయ్య, ప్రధానకార్యదర్శిగా డా॥ పసుపులేటి కృష్ణమూర్తి సహాయకార్యదర్శులుగ కొసంచేటి విశ్వనాథం, ఉప్పల వెంకట్రామయ్యగార్లు మొదలుయినవారు ఎన్నుకోబడిరి.

## తపాలా విధాన పునర్నిర్మాణం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 21: భారతంలోని తపాలా విధానాన్ని పునర్నిర్మాణంచేసి, ఢిల్లీ, కలకత్తా, నాగపూర్, బొంబాయి, మద్రాసు నగరాలలో అయిదు ప్రధాన కేంద్ర కార్యాలయాలను స్థాపించే విషయం పరిశీలించ బడుతోందని తెలుస్తున్నది.

నూతన తపాలా విధానాన్ని ప్రవేశపెట్టిన తరువాత ఉత్తరాల బట్వాడాలో చాలా ఆలస్యం జరుగుతోందని తెలియవచ్చింది. పార్లమెంటు సభ్యులు ప్రతిబంధకాలుగా నున్నాయని చెప్పబడింది.

ఇప్పుడున్న లోపాలను తొలగించే ఉద్దేశంతో పోస్టు మరియు తపాలా శాఖ డైరెక్టర్ జనరల్, శ్రీ శ్రీనివాసన్ గారు పరిశోధన జరుపుతున్నారు. —గ్లోబ్

## ఇటలీ వలసలయెడ బ్రిటన్ విధానం

### సోవియట్‌రష్యా విమర్శ

లేక్‌సక్సెస్, ఏప్రిల్ 21: "ఆఫ్రికాలోని ఇటాలియన్ వలసప్రాంతాన్ని, ముక్కలు ముక్కలుగా చీంచి, బ్రిటన్ అమెరికాలు తమ తమ చేతులక్రింద కొంతా, ఇటలీచేతిక్రింద కొంతా, మరొకరి చేతిక్రింద కొంతా ఇలా ఛిన్నాభిన్నం చేసివేయటానికి ప్రయత్నించుచున్నవి" అని, ఈ రోజు, ఐక్యరాజ్యసమితి రాజకీయసమాసభలో ఆఫ్రికాలోని ఇటాలియన్ వలసల సమస్య చర్చకు వచ్చినప్పుడు, రష్యాప్రతినిధి అంద్రేగ్రోమికో అమెరికా బ్రిటనులకు దూయబట్టాడు. ఇటాలియన్ వలస భాగాలను బ్రిటన్ అధికారంక్రింద వుంచాలనే అభిప్రాయాన్ని ఖండిస్తూ ఇలా ప్రసంగించాడు:

"ఈ బ్రిటిష్ ఆధిపత్యంక్రింద వుంచితే, ఆ ప్రాంతాల ప్రజలు బానిసలే వేదికలో, ఆ భారత ప్రతినిధి చెబుతున్నాడు వినండి. అది అనుభవంమీద చెబుతున్న మాటలు. వలసప్రజలంటే తమకు ఎక్కడాలేని ప్రేమా బాగ్గులు కారుస్తుందని, ఈ బ్రిటిషు వారు పాటలు పాడుతారే, పాటలు-వాటి అంతర్యము అర్థమౌతుంది. వలసప్రభుత్వం పట్ల అసమ్మతి ప్రకటించిన, [illegible] వున్న తెలివిగల పౌరుల నందర్నీ పట్టబడి జైళ్లలో పారేశారు. అసంతృప్తి ఆ భారతదేశపు మనిషి చెబుతున్నాడు, వినండి. ఫ్రాంసు సంగతి చెబుతున్నాడు కొంత ఆకళించండి. పాకిస్థాన్ ప్రతినిధి కూడా యిదే అదే ధోరణిలో మాటలాడుతున్నాడు. కొంత వినిపించుకోండి.

బ్రిటిష్ వలసపరిపాలనావిధానమంతా ఈనాడు మనకజేమీ క్రొత్తగాదు. వలసప్రజలతోమాటాజాలం చేస్తే, స్త్రీ-పురుషుల భావ తప్ప వారికి మరేదీరాదు. ప్రజల ఆర్థికాభివృద్ధి విధానం' అన్న భావన వారికి రానేరాదు.

ఇవంతా ఇటాకవ్వాలా చూస్తూ, వీరు వలస ప్రజల్ని బానిసచేస్తారని మన మింకా అనుకొంటున్నట్లయితే, వాస్తవాన్ని అర్థంచేసుకోలేని మనవంటి మూఢ విశ్వాసంగల ధాందసులు మరెక్కడా వుండరు.

"ఈ వలసలమీద ఇటలీకి లోగడవున్న అధికారాన్ని ఆలోచించ వచ్చునంటే, పశ్చిమ రాజ్యాలవారికి ఈ వలసల్లో యుద్ధస్థావరాలు నెలకొల్పుకోటానికి ఇటలీ ఓ పెంపు వాగ్దానం ఇప్పటికే చేస్తున్నది.

"ఐక్యరాజ్యసమితి ధర్మకర్తృత్వంక్రింది, ఈ వలసలకన్నిటికి సంయుక్త ప్రభుత్వమేర్పడటమే ఇందుకు తగుమైన మార్గం. ఆయా ప్రజలకూ, ఐక్యరాజ్యసమితికీ కూడా, ఈ విధానం బహాన్ని చేకూర్చి లాభదాయకంగా వుంటుంది. ఒకే ఒక ప్రభుత్వంక్రింద అంతా కలిసి వుంటే, అక్కడిప్రజలు ఐక్యతతో సంఘటితపడటానికీ, ఆర్థికంగానూ, రాజకీయంగానూ కూడా బాగుపడటానికి అవకాశం వుంటుంది" అన్నాడు.

తదనంతరం 'సోమాలీ యువజనసమితి' ప్రతినిధి అబ్దుల్లా ఇసా, ప్రసంగిస్తూ, సోమాలీలాండ్‌లో తిరిగి ఇటాలియన్ ప్రభుత్వం యేర్పడటానికి వసేమీవల్ల కాదని స్పష్టంచాదాడు. "ఇటలీ మా ప్రజల్ని ఇప్పటికే 50 సంవత్సరాలు పీడించుకు తింది ఇకచాలు!" అన్నాడు.

అమెరికా ప్రతినిధి ఇలాఅన్నాడు, "ఈ ఐక్యరాజ్యసమితి, రెండుకక్షలుగా చీలి పెద్దరణరంగంగా తయారైంది. ఈ ప్రజలచేతుల్లో ఆయాప్రజలను వుంచటం మంచిదేనా?—అసలు, ట్రిపోలీటేనియా ప్రాంతంలో కనసుసాధనంకోవాలని రష్యా ఆకేలపించి ఉంటేపోతే, ఈసమస్య రొప్పుడో నాలుగుసంవత్సరాలక్రితమే తేలిపోవలసింది."

సమావేశం వాయిదాపడింది.

## "ఇంపీరియల్ ప్రిఫరెన్స్"

లండన్, ఏప్రిల్ 21: కామన్వెల్తు సమావేశంలో "ఇంపీరియల్ ప్రిఫరెన్స్" పై చర్చలు జరుగవని జరిగిన ప్రకటన నమసరించి ప్రధానుల సంభాషణలు ఫలితంగా కాలాలలో కలిగే మార్పులు ఈ విధానాన్ని కవర్తింపవని గోచరిస్తున్నది. త.

కామన్వెల్తు దేశాల రాజకీయ బాంధవ్యాలలో మార్పులు కలిగేముందల అర్థిక సంబంధాలను తిరిగి పరిశీలించ వలసి యుంటుందని కొన్ని వర్గాలవారు చెబుతున్నారు. కామన్వెల్తు సమావేశం పరిశీలించే వస్తువుల పరిష్కారం ఎక్కువగా "ఇంపీరియల్ ప్రిఫరెన్స్" పై ఆధారపడుతుందని వీరి అభిప్రాయం.

కామన్వెల్తు ప్రతినిధులు ప్రత్యేకంగా తమలో తాము వ్యాపార విషయమై చర్చలు జరుపుకొనవచ్చును.

## భారతానికి అధికంగా డెస్ట్రాయర్లు

లండన్, ఏప్రిల్ 21: భారతనౌకా సైన్యం కొన్ని నూతన 'డెస్ట్రాయర్' లను నడపటానికి ప్రారంభించి చేయబడి, కామన్వెల్తు నౌకాయుద్ధములో అప్పగించబడటానికి సిద్ధంగా ఉన్నదని తెలుస్తున్నది.

## వేలం నోటీసు

విశాఖపట్టణము వాస్తవ్యులైన శ్రీ రెడ్డి సన్యాసయ్యగారినుండి రావల సిన ఇన్‌కంటాక్సు రాబట్టు నిమిత్తముగాను, 25-4-49 తేది ఉదయము 11 గంటలకు విశాఖపట్టణం తాలూకా ఆఫీసులో, విశాఖపట్టణము తహశీల్‌దారుగారిచే, ఈ క్రింది ఆస్తులు బహిరంగ వేలములో అమ్మబడును.

(1) ఒక ఫోర్డు లారి MDV 302.
(2) ఒక డాడ్జి కారు MDV 710.
(3) ఒక రెమింగ్టన్ టైప్‌రైటరు.
(4) రెండు బీరువాలు.
(5) రెండు బ్యాటరీలు.

(సం.) ఎస్. కృష్ణమూర్తి,
తహశీల్‌దారు.



# ఆహార సమస్యపై రాష్ట్ర శాసనసభలో అర్ధగంట చర్చ

## పాత శాసన పునరుద్ధరణకై సెలెక్టుకమిటీ

మదరాసు, ఏప్రిల్ 20 : మదరాసు అసెంబ్లీలో నేడు సాయంకాలం ప్రశ్నోత్తరములు ముగియగానే, కౌన్సిలులో ప్రాతచట్టాల పునరుద్ధరణ చట్టం సెలక్టు కమిటీకి కౌన్సిలులో అగుపు సభ్యులను ఎన్నుకొనెనని అధ్యక్షుని సందేశమును చదివిరి. ఈ దినుసు 12 మంది సభ్యులను అసెంబ్లీనుండి సెలక్టు కమిటీకి నియమించవలసినదిగా శ్రీ. మాధవమీనను (లామంత్రిగారు) సూచించిరి:—

డా॥ పి. సుబ్బరాయను, ఎం. భక్తవత్సలం, శ్రీ. చంద్రమౌళి, మహబూబు ఆలీ బేగ్, హైగ్రీవాసు, డబ్ల్యు. పెర్నాండెజు శ్రీ. భాష్యం. కల్లూరి సుబ్బరావు, ఆర్. వెంకటరెడ్డి, టి. విశ్వనాథం, ఎల్. ఎస్. కరయత్తుగార్లు.

హరిజను ఒక్కడూ లేడని బి. ఎస్. మూర్తి, నాగప్పగార్లు సూచింపగా, కౌన్సిలులో సభ్యుడను హెచ్. జగన్నాథంగారున్నారని మంత్రిగారనిరి. ప్రతిపాదనకు ఓటుచేయునపుడు నాగప్పగారు పెద్దగా "నో" అని అరచిరి. తీర్మానం అంగీకరింపబడినదని అధ్యక్షులు ప్రకటించగా ఓట్లు లెక్కించాలని కోరిరి. పార్టీనాయకు సకిగి మరీ కోరండి, అని అధ్యక్షులనగా, కమిటీలలో హరిజనులకు ప్రాతినిధ్యం యిక్కముందు యిస్తామని మంత్రిగారు అభయమివ్వాలని నాగప్పగారు కోరిరి. అన్ని సంఘాలకు ప్రాతినిధ్యం ఉండేటట్లు ప్రయత్నిస్తామని గోపాలరెడ్డిగారనగా నాగప్పగారు పట్టు విడిచిరి. తీర్మానమంగీకరించబడెను.

ఆహార సమస్యనుగూర్చి ప్రశ్నలలో తృప్తికరమగు జవాబు రాలేదనుకొనుక, సభ ముగిసేలోపుగ అరగంట చర్చకు అవకాశమివ్వాలని హమీదుఖానుగారు కోరగ అధ్యక్షుడు సరే ననెను. సభానాయకుని సంప్రదించనిది అధ్యక్షుడంగీకరించవచ్చునా యని కల్లూరు సుబ్బరావుగారు ప్రశ్నింప, "సంప్రదించ నక్కరలేదు. స్పీకరుకి అధికారం గలదు" అని స్పీకరు శివషణ్ముగం పిళ్ళెగారు తెలిపిరి.

బి. గోపాలరెడ్డి : అపుడు సభలో తగినంతమంది సభ్యులు లేనందుచే ప్రభుత్వాన్ని నిందింపరాదు.

ముత్తయ్య చెట్టి-అధికసంఖ్యా బలంగల ప్రభుత్వ వర్గంవారట్లనరాదు. మంత్రిగారు తమపార్టీ సభ్యులను వెడలిపొమ్మని సూచిస్తున్నారు. అది తగదు. అధ్యక్షుడు ప్రభుత్వపక్షాన్ని అట్టి సహాయనిరాకరణం చేయకుండా చూడాలి.

గోపాలరెడ్డి - కోరంలేకపోతే మాపూచీవన్నాను. అంతేకాని పొమ్మని సూచన కాదు.

స్పీకరు :- సభ్యులు కోపంతో మాట్లాడుకోరాదు. గోపాలరెడ్డిగారిని సభవారు అపార్థంచేసుకోరాదు. చర్చ నాటంకపరుచుట వారి యుద్దేశంకాదు. చర్చనీయాంశం సారంలేనిదైనే, సభ్యులుండకపోయినచో, తీర్మానం ప్రతిపాదించినవారిదే పూచీయని వారి యుద్దేశము అనిరి.

తరువాత హమీదుఖానుగారు ఉపన్యాసం మొదలుపెట్టేసరికి పలువురు సభ్యులు దబదబా వెడలిపోతూ వుండగ నిశ్శబ్దంగా వెడలిపోవాలని అధ్యక్షుడు సూచించెను. చర్చ జరిగిన అర్ధగంట సేపు కోరం ఉండెను.

ప్రభుత్వంవారి ఆహారపంపక విధానం న్యాయంగాలేదనియు, అందుచే కొన్ని చోట్ల ప్రజలు తిండిలేక చనిపోతున్నారనియు, యితర కారణాలచేత చనిపోయరని ప్రభుత్వంవారు బాధ్యత తప్పించుకోరాదనియు, అదనపు జిల్లాలకు పక్షపాతంతో చూడరాదనియు, హమీదుఖానుగారనిరి.

కేంద్రప్రభుత్వంవారు అన్ని జిల్లాలలో రేషనింగు అమలు జరుపమని చెబితే, తంజావూరువంటి కొన్ని జిల్లాలలో ఎందుకమలు జరుపలేదని అ. సూటిగా అడిగిరి.

ఎ. వైద్యనాథయ్యరుగారు తంజావూరు జిల్లావారు యిచ్చిన ధాన్యం పై జిల్లాలకు త్వరగ ఎగుమతి చేయలేనంత ఎక్కువగ నున్నదనిరి. ఇతర జిల్లాల నారికన్న ఎక్కువ అప్పున్నల రేషను తంజావూరు వారు తీసుకోవటం లేదాయని హమీదుఖానుగా రనగా యితర జిల్లాంవారు వాణిజ్య పంటలు పండించి లాభం పొందుచుండగా తంజావూరు ధాన్యం పండించి తక్కువ ధర కమ్ముకొనుచున్నారు వారి రేషను తగ్గించిన ఉత్పత్తి తగ్గునని - వేదరత్నం పిళ్లెగారనిరి.

మంత్రి డా॥ రాజనుగారు చర్చకు జవాబు చెప్తూ, అన్ని జిల్లాలకన్న తంజావూరు జిల్లావారు కోటాను మించి సరకు ప్రభుత్వంవారి కిచ్చిరని అభినందించి, అన్ని జిల్లాలు అట్లు చేసిన బాగుండుననిరి. ఇండియా ప్రభుత్వంవారి షరతుల ప్రకారమే ధాన్యం బియ్యం పంపకం చేస్తున్నామనిరి.

"తిండిలేక చచ్చిరన్న మాట అబద్ధం. డబ్బున్నవారందరికి రేషను లభించుచున్నది. చావుబ్రతుకులకు అనేక కారణాలుండవచ్చును. డబ్బులేక రేషను కొనలేక తిండిలేక ఎవరయిన చనిపోతే దానికి కూడా రేషనింగు పద్ధతిలో ప్రభుత్వంవారు పూచీపడలేరు. ధాన్యం ఉత్పత్తిదారులకు ఎక్కువగా చూడక తప్పదు. తంజావూరు ఉత్పత్తిదారులు ప్రశంసనీయంగా ప్రవర్తించిరి." అని తెలిపిరి. సభ 22 తేదీ ఉదయం 10-30 వరకు వాయిదా వేయబడెను.

## విశాఖజిల్లా శిస్తులు

విశాఖజిల్లాలో జమీను గ్రామాలశిస్తుల తగ్గింపు స్పెషలు ఆఫీసరు శిఫార్సులు ప్రభుత్వానికి పంపెననియు, వాటిని తిరిగి సవరింపవలసిందిగా ప్రభుత్వంవా రాతనికి పంపిరనియు, శ్రీ. సన్యాసిరావుగారు ప్రశ్నకు బదులుగా రివెన్యూమంత్రి గా॥ సీతారామరెడ్డిగారు, అసెంబ్లీలో చెప్పిరి.

స్పెషలు ఆఫీసరు జమిందారీ గ్రామాల శిస్తులు ఒకనైపు చేరుదగానున్న శ్రీకాకుళం నరసన్నపేట తాలూకా శిస్తుల మేరకు తగ్గించక, ఎక్కువగనున్న పాలకొండ శిస్తు రేట్లమేరకు మార్చలేదాయని శ్రీ గ. కుమారస్వామిగారడుగగ, ఆవిషయం గా॥ సభ్యునివద్ద తెలుసుకొనుచున్నాను.

రా॥ రామమూర్తి—పని అలక్ష్యమగుచున్నందున ఎక్కువమంది స్పెషలాఫీసరులను నియమించరాదా. జ—త్వరగ పని జరిగే ఏర్పాటులు చేయుచున్నాను.

స్పెషలాఫీసరు నిర్ణయించే శిస్తుమార్పులపై అపీలు వకీలుద్వారా కాక, స్వయంగా దాఖలు చేసుకుంటే ఫలితంలేకుండాపోవునా. వకీలు అవసరంలేకుండా చేయరాదాయని జె. నారాయణరెడ్డిగారడుగ, చట్టంప్రకారం అపీలువిచారణ జరుగుచున్నదనియు, తగ్గింపురేట్లు గ్రామ మొత్తంపై నోటీసు చేయబడుననియు, ప్రత్యేక వ్యక్తులకు నోటీసు యివ్వరనియు మంత్రిగారు బదులుచెప్పిరి.

## న్యాయస్థానాల సెలవుదినాలు

హైకోర్టు జిల్లాకోర్టుల వేసంగి సెలవు దినాలు తగ్గించుటనుగూర్చి ప్రభుత్వం వారు ఆలోచిస్తున్నారని, మంత్రి మాధవమీనను గారు అసెంబ్లీలో ప్రశ్నలకు బదులుగా చెప్పిరి. ప్రస్తుతం జిల్లాకోర్టులకు 6 వారాలు, హైకోర్టుకి 2 నెలల వేసంగి సెలవులొసంగబడుచున్నవి. ఇవి తగ్గించుట అవసరమని తోచి హైకోర్టుతో ప్రభుత్వం వారు సంప్రదించుచున్నారు. ప్రస్తుతం హైకోర్టుకి సాలుమొత్తాన 219 దినాలు, జిల్లా కోర్టులకు యింకో నెల తక్కువగను సెలవులుంటున్నాయని, ఉపప్రశ్నలకు బదులుగ చెప్పిరి.

## మదరాసు చట్టముల పునరావోదించు బిల్లు

మదరాసు, ఏప్రిల్ 21 : మదరాసు చట్టముల పునరామోదించు బిల్లు పరిశీలనకు నియమించబడిన శాసనసభల సెలెక్టుకమిటీ నేడు సెక్రటేరియటులో సమావేశమై బిల్లులను చర్చించి అంత్యనిర్ణయము చేసిరి. సెలెక్టుకమిటీలో చెప్పుకోదగ్గ సవరణలు ఏమీ జరుగనట్లు తెలుస్తుంది.

రేపు అసెంబ్లీలో బిల్లు ప్రవేశపెట్టబడునని తెలియుచున్నది.

### జమీందారీ రద్దుచట్టం

మదరాసు జమీందారీ రద్దుచట్టమునకు గవర్నరు జనరలుగారు అనుమతించి నందున శాసన మయినట్లు 20 వ తేదీ ఫోర్టుసెంటుజార్జి గజిటులో ప్రకటింపబడెను.

## ఫాక్టరీ నిబంధనలు

మదరాసు ఫాక్టరీరూల్సు చిత్తుప్రతి యీ వారం ఫోర్టుసెంటుజార్జి గజిటులో ప్రకటించబడింది. దానిపై ఆక్షేపణలు సూచనలుచేయువారు 1949 ఆగస్టు 1 తే. లోగా ప్రభుత్వ లేబరుడిపార్టుమెంటుశాఖ కార్యదర్శికి పంపవలెను.

### షెడ్యూల్డుకులాల కార్యదర్శి

ఓ. ఎస్. విశ్వనాథంగారు, ఐ. సి. ఎస్. షెడ్యూల్డుకులాల కార్యదర్శిగ టి. ఎ. పద్మనాభంగారి సెలవులో నియమింపబడిరి.

గోపాలకు అను ఇండోక మహిళలు బ్యాంకు ఉద్యోగి రూ 20,000 లోపించి నందుకు తనపై కేసువిచారణలో నిర్బంధంలో ఉండగా, జనరలు ఆస్పత్రియందు చికిత్సపొందుచు చనిపోయెను. సహజ కారణములచే చనిపోయెనని మేజస్ట్రేటు శవపరీక్షలో తీర్పుచెప్పెను.

నాంపల్లిలో 35 మందిని అరెస్టుచేసి 500 పడుల దొంగవ్యాపారం బియ్యం పోలీసులు పట్టుకొనిరి.

# నేషనలు సేవింగ్సు ప్రచారం

## మదరాసు ప్రధాని హెచ్చరిక

మదరాసు, ఏప్రిల్ 20 : నేషనలు సేవింగ్సు శాఖవారు రాజాజీ హాలులో నిన్న సాయంకాలం జరిపిన బహిరంగ సభయందు, పాటలువ్రాసి, పాడినవారికి బహుమతులు పంచియిచ్చి, మదరాసు ప్రధాని పి. ఎస్. కుమారస్వామిరాజాగారు, తాము మిగల్చగలిగిన డబ్బంతా ప్రజలు సేవింగ్సు స్కీములోనే దాచుకోవాలని హెచ్చరించిరి.

ఎస్. ఎ. అయ్యస్వామి చెట్టిగారు స్వాగతోపన్యాసము నొసంగి, తక్కువ మిగుల్చుకో గల్గినవా రందరికి నేషనలు సేవింగ్సు స్కీమే మంచి అవకాశమిచ్చునని చెప్పిరి. ఆర్. కె. షణ్ముగం చెట్టిగారు స్కీము వివరములనుగూర్చి తెల్పిరి.

ప్రచారపు రికార్డులు తయారుచేయుటకు పాటలు పాడి తోడ్పడినవారికి బంగారు పతకాలు, మోటారుబండ్లు నలంకరించి పంపినవారికి సర్టిఫికేట్లు ప్రధాని పంచి యిచ్చెను.

"ఆర్థిక స్వాతంత్ర్యం లేనిది రాజకీయ స్వాతంత్ర్యం ఉపయోగం లేదు. ఆర్థికస్వాతంత్ర్యానికై ఎన్నో ఘనకార్యాలు నెరవేర్చాలి. వాటికి డబ్బు అవసరము. అది ధనికులే గాక, సామాన్యజనులుకూడ ఇవ్వాలి." అని ప్రధాని తెలిపెను. మేయరు ఎస్. రామస్వామినాయుడుగారుకూడ ప్రసంగించిన పిమ్మట సభ ముగిసెను.

పోస్టలుశాఖవారు రాజాజీ హాలులో ఆరోజు ఏర్పాటుచేసిన సర్టిఫికేట్లు అంగడిలో రూ. 10357 వేల సర్టిఫికేట్లు స్టాంపులు సభాసమయమున చెల్లినవి.

# సెక్యూరిటీ వ్యవహారములు

### పిటిషనరు తరఫున అడ్వకేటు కోర్టుఫీజు చెల్లింపనక్కరలేదు

చెన్నపట్నం, ఏప్రిలు 21 : మద్రాసు హైకోర్టులో న్యా॥ యన్. సోమసుందరం గారి యెదుట ద్రోణాచలం సబ్ డివిజను మేజస్ట్రేటువద్ద 17 మంది వ్యక్తులమీద క్రిమినల్ ప్రొసీజరుకోడు సెక్షను 107 క్రింద యుండే సెక్యూరిటీ వ్యవహారముల విచారణ ఆపుచేయవలెనని దాఖలైన పిటిషనులో కోర్టుఫీజుకు సంబంధించిన యీ క్రింది ప్రశ్న ఉద్భవించెను. సెక్యూరిటీ వ్యవహారములలో అడ్వకేటులు కక్షిదారుల తరఫున దాఖలుచేసే మెమో పత్రములకు కోర్టుఫీజు చెల్లించుట అవసరమా కాదా అనే ప్రశ్నవచ్చినది. క్రిమినల్ రూల్సు ఆఫ్ ప్రాక్టిసు 361 ప్రకారము యితర క్రిమినల్ కేసులలోవలె ముద్దాయిల తరఫు దాఖలయ్యే మెమో పత్రాలకు యేవిధముగా కోర్టు ఫీజు మినహాయింపు ఉన్నదో ఆ విధమున సెక్యూరిటీ వ్యవహారములలో కూడా కౌంటరు పిటిషనరు తరఫు దాఖలయ్యే మెమో పత్రములకు కోర్టు ఫీజు చెల్లింప నవసరము లేదని శ్రీ ఓ. యన్. చిన్నప్పరెడ్డిగారు వాదించిరి.

క్రిమినల్ కేసులన్నిటిలోను ముద్దాయిల తరఫు అడ్వకేట్లు దాఖలు చేసే మెమో పత్రములకు 361 నిబంధన ప్రకారము కోర్టు ఫీజు మినహాయింపు యున్నది. గాన సెక్యూరిటీల వ్యవహారాలు కూడా క్రిమినల్ వ్యవహారాలే కాబట్టి అడ్వకేట్లు మెమో పత్రాలకు కోర్టు ఫీజు చెల్లించుట అనవసరమని న్యా॥ సోమసుందరంగారు యీదినం నిర్ణయమిచ్చిరి.

### సంఘ శ్రేయోభివృద్ధి దినోత్సవములు

గా॥ రాజకుమారి అమృతకౌర్ గారు ఆదేశించినప్రకారము ఏప్రిలు 24 వ తేదీ మధ్యాహ్నం 3 గంటలనుండి సంఘ శ్రేయోభివృద్ధి దినోత్సవము సందర్భమున గా॥ యం. భక్తవత్సలంగారి అధ్యక్షతను సభ జరుగును ప్రధానిగారు యీ సభను ప్రారంభించగలరని ఆశింపబడుచున్నది.

### డిటెన్యూ విడుదల

ప్రజాశాంతి రక్షణ చట్టము క్రింద డిటెన్యూగానున్న శ్రీ ఆల్లూరు రంగారెడ్డి (నెల్లూరు) గారిని విడుదలచేయుటకు ప్రభుత్వము ఉత్తరవుచేసినది.

తిరువయ్యూరు పేటలో 50 మంది మిల్లు జాములనుండి బియ్యం తెచ్చి అమ్ముచున్నవారు అరెస్టుచేయబడిరి. 142 పడులు దొరికెను.

కార్పొరేషనువారు నగరంలోని కొన్ని బ్లాకులలో నొకటి, జార్జిటవునులో నాటుపెట్టు కోవిలు వీధియందొకటి రెండుబోర్ఖులు క్షవశాలలు రూ 75000 లతో కడుతున్నది. యీ సెంటర్లలో పూర్తికావొచ్చు. వీటిలో కార్పొరేషనువారి 178 పాఠశాలలలో 76 పాఠశాలలకు స్థలవసతులు కలవు.

# ఢిల్లీలో విద్యార్థుల ప్రదర్శన

## లాఠీచార్జీ

ఢిల్లీ, ఏప్రిల్ 21 : ఢిల్లీ విశ్వవిద్యాలయ పబ్లికు పరీక్షలు వచ్చే మాసంలో జరుగవలసియున్నది. కానియీ పరీక్షలను వాయిదా వేయవలెనని ఆందోళనచేయుచూ విద్యార్థులనుంపు ఢిల్లీ విశ్వవిద్యాలయ వైసు చాన్సలరు ఆఫీసుయెదుట కొంత అల్లాటము చేసిరి. వెంటనే పోలీసులు లాఠీచార్జీ చేసిరి. 17 మందికి దెబ్బలు తగిలెను. అందులో 7 మంది బాలికలు ఉన్నారు. విద్యార్థులకు పోలీసులకు జరిగిన సంఘర్షణలో 4 గురు పోలీసులకు దెబ్బలు తగిలెను. ఈ ఆందోళనచేసిన విద్యార్థి బృందములో ఎక్కువమంది కాంగ్రెసు వైయున్నారు. సుమారు 500 మంది విద్యార్థులు ఊరేగింపుగా వచ్చిరి.

వారిని చెదరగొట్టుటకై పోలీసులు బాష్పవాయువుకూడ ప్రయోగించిరి. పోలీసులందరు విద్యార్థులను అరెస్టుచేసిరి.

# సంయుక్త మహారాష్ట్ర ఉద్యమ ప్రచారము

పూనా, ఏప్రిల్ 21 : ఐక్య మహారాష్ట్ర మహాసభ కార్యనిర్వాహకవర్గము తమ రాష్ట్రసిద్ధికై ప్రచారము చేయు నిమిత్తమై వేర్వేరు కమిటీలను వేర్వేరు ప్రాంతములలో ఏర్పాటుచేయవలెనని తీర్మానించెను. బొంబాయినగరములోను, దక్షిణ మహారాష్ట్రమునందును, మధ్యపరగణాలలోని మరాఠీ ప్రాంతములోను కమిటీలను ఏర్పాటుచేయు తీర్మానించిరి. బొంబాయినగరముతో సహా చేరియుండెడి మహారాష్ట్రము కావలెనని ఆందోళనచేయ సంకల్పించిరి.

నిన్నటి దినం జరిగిన యీ కార్యవర్గ సమావేశమునకు కేంద్ర ప్రభుత్వపు పబ్లికు వర్క్సు మంత్రి గాడ్గిలుగారును, హైదరాబాదు స్టేటు కాంగ్రెసు ప్రెసిడెంటు రామానందతీర్థగారును, అ. భా. కాంగ్రెసు కార్యదర్శి శంకరరావుదేవు గారును హాజరైరి. శంకరరావుదేవుగారు సమావేశమునకు అధ్యక్షత వహించిరి.

# చీరాల పురపాలక సంఘ ఎన్నికలు

### మే 26 న జరుగుతాయి

చీరాల, ఏప్రిల్ 20: ఈ పురపాలక సంఘ తొలి ఎన్నికలు మే 26 న జరుగుతాయని అధికారరీత్యా వెల్లడియైనది. మే 2, 4 తేదీలయందు నామినేషన్లు దాఖలు చేసుకొంటారు. (అ. ప్రె.)

### మదరాసులో క్రొత్తకోర్టు

హైకోర్టు ఒరిజినలు కేసులు తగ్గించుటకై ఒకసిటీ జిల్లాజడ్జిలుగల కోర్టును మదరాసులో స్థాపించుటకు ప్రభుత్వంవారొక చట్టమును తయారుచేయుచున్నారు.

### తెలుగువిజ్ఞాన సర్వస్వం

విజ్ఞానసర్వస్వం తయారుచేయుచున్న తెలుగుభాషాసమితికి మదరాసుప్రభుత్వం వారు ఒకలక్ష రూపాయల గ్రాంటుయిచ్చిరి. శ్రీ. మొదటి రెండు వాల్యూములు 1949-50లో ప్రచురింప యత్నించుచున్నారు.



### ప్రకటన

## బెంగాల్ నాగపూర్ రైల్వే

### క్లెయిముల శీఘ్రపరిష్కారము

క్లెయిములకు సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరముల విషయములో, ఇదివరకే పడిన క్లెయిము విషయమై ప్రస్తావించబడి, విచారణ జరుగుచున్న కేసులకు సంబంధించి క్లెయిమ్సు ఆఫీసుకు చేరు జాబులలో, ఆఫీసువారియొక్క లోగడ రిఫరెన్సు నెంబరు తరచుగా ఉదహరింపక పోవుట గమనింపబడుచున్నది. అందువలన, కేసుల పరిష్కారమునకు అనవసరమైన ఆలస్యము, అధికమైన పని కలుగుచున్నది. కాబట్టి, క్లెయిము దారులు ఈ ఆఫీసుకు వ్రాయునప్పుడు, లేదు జాబులలో క్లెయిమ్సు ఆఫీసు జాబుల లోగడ రిఫరెన్సు నెంబర్లు తప్పక తెలియపరచుము, పి. నెమ్బరు, బిల్లు, R/R నంబర్లు లేదా యితరయుక్తమైన వివరములు ఉదహరింపవలసినదిగా రైల్వేవారు కోరుచున్నారు.

ఆ విధముగా చేసిన మెడల రైల్వేవారు, క్లెయిములను శీఘ్రముగా పరిష్కరించుటకు వీలగును. క్లెయిముదారుల కేసులు యింకను శీఘ్రముగా పరిష్కరింపబడును గావున యిది వారికే లాభకారిగా నుండును.

క్లెయిముల సూపరింటెండెంటు.

## అట్లీ - నెహ్రూ చర్చలు

[1 వ పేజీ తరువాయి]

ఖాన్ కొంచ, సింహళ ప్రధాని సేనానాయకే గారు, ఆతనువాత న్యూజీలాండ్ ప్రధాని ఫ్రేజర్, కెనడా ప్రతినిధి పియర్సన్, దక్షిణాఫ్రికా ప్రధాని మలన్ దంపతులు చిట్టచివరకు ఆస్ట్రేలియా ప్రధాని చిఫ్లే వచ్చారు.

ఆట్లీ భవనంలో కొంతసేపు ఉన్న తరువాత వారంతా బకింగ్ హాం రాజభవనంలో విందుకు వెళ్లిరి. జార్జిరాజు, ఎలిజబెత్తు రాణీగార్లు 30 మంది అతిథులలో పాల్గొనిరి. వారిలో కామన్వెల్తు ప్రధానులు, రాజమాత మేరీరాణి, ఎలిజబెత్ రాకుమారి మొదలైనవారు ఉన్నారు.

## దక్షిణాఫ్రికా భారతీయ కాంగ్రెస్ తంతి

జోహాన్సెస్ బర్గు, ఏప్రిల్ 21 : శ్వేత జాతి పీడన నుండి విముక్తిపొందుటకు జరుగుచున్న పోరాటం యొక్క అంతిమ ఫలితాన్ని గురించి లక్షల కొలది ప్రజలు ఆసక్తితో ఎదురు చూస్తున్నారని దక్షిణాఫ్రికా భారతీయ కాంగ్రెస్ నేడు లండన్లో కామన్వెల్తు ప్రధానులకు తంతిపంపింది. కామన్వెల్తులో ఇండియా ఉన్నా లేకపోయినా జాతివివక్షత మీద కామన్వెల్తులోని ప్రజలు చూపదలచుకున్నప్పుడు సోదర దేశాల మధ్య సద్భావ సౌజన్యాలు ఎప్పుడూ వుదరవన్ని ముఖ్యంగా గుర్తుంచుకోవలెనని, వారు తెలియజేశారు.

## డచ్‌వారి సమ్మతి

1 వ పేజీ తరువాయి

నట్టున్నా గాలి కబురుగా తెలుస్తోంది. అంటే ఈ వార్త యింకా రూఢి కాలేదు

రిపబ్లికనులు ప్రతిపాదించిన అంశాలన్నిటికీ ఒక్కొక్కదానికీ సమగ్రమైన సమాధానాన్ని చెప్పటానికి, తనఅనుయాయులు తీవ్రంగా ప్రయత్నించుచున్నారనీ, అయితే ఈ ప్రతివచనం ముసాయిదా యింకా పూర్తికాలేదనీ డాక్టర్ వాన్‌రోయన్ తెలుపుతున్నాడు.

సంప్రదింపులు ఫలవంతె మాతాయనే పెద్దలకేలు యే వర్గాలలోనూ కనుపించటం లేదు ఇంతకంటే తాము దిగిరావటానికి యే విధమైన అవకాశమూ లేదని రిపబ్లికను అధికారవర్గాలనుంచి తెలుస్తున్నది. "ఈ సంప్రదింపులకు అసలు ప్రతినిధులను పంపటమే చాలా చూచి యున్నాం. మా అధికారపరమూ పథదాకా వెళ్లాం. డచ్ వారు ప్రతినిధులు కోరుచున్న షరతుల నంగీకరించి యుద్ధవిరమణ విషయంలోనూ, రౌండుటేబులు సమావేశం విషయంలోనూ ముమ్ముందుగానే ఎట్టి హామీలూ యివ్వటానికి అవకాశం లేదు. అట్టిది జరిగితే రిపబ్లికనుపక్షంలో ఐక్యత చెడి చీలికలు వచ్చే అవకాశం వున్నది. అని రిపబ్లికన్ ప్రధాని మహమ్మద్ హట్టా అన్నట్టు తెలుస్తున్నది.

ఈ సంప్రదింపులు వచ్చేవారానికి ఒక ముఖానికి రావచ్చునని అనుకుంటున్నారు కారణమేమంటే ఐక్యరాజ్యసమితి రాజకీయమహాసభలో అనేక అంశాలు చర్చకు తేవటానికి రిపబ్లికనులు ప్రయత్నిస్తున్నారు. ఈలోగా ఇక్కడ తాడో బొంగరమో తేల్చుకుంటేగాని దానికి అవకాశంవుండదు.

రిపబ్లికనులేగాక, ఇతరులు కూడా సంప్రదింపులలో పాల్గొనటానికి, పశ్చిమ జావాలోని పాసుడాన్ ప్రధాని అద్దుహోనా, తూర్పు ఇండొనీషియా ప్రధాని అనాక్ అగంగ్ ఈఇవ్యయా ఒక ప్రణాళికను తయారుచేయటానికి అలోచిస్తున్నట్టు తెలుస్తున్నది. కొద్దిమాత్రముగా రిపబ్లికన్ సానుభూతిపరులు. సంధిసంప్రదింపులు విజయవంతం కావటానికి ఈ ప్రధానులిద్దరూ ప్రయత్నించుతారని డచ్ అధికారవర్గాలనుంచి తెలుస్తున్నది.

వచ్చే సమావేశం, తిరిగి యెప్పుడు జరుగుతుందో తేదీఏదీ నిర్ణయించబడలేదు. డచ్ షరతులకు సమాధాన మిచ్చేలోగా రిపబ్లికన్ ప్రతినిధులు తిరిగి ఒకసారి బంకాకు వెళ్లి రావాలని అభిలషించడమే ఇందుకు కారణమంటున్నారు.

## చైనా కమ్యూనిస్టు నాయకుల ఆదేశం

1 వ పేజీ తరువాయి

గా కనిపించలేదు. కమ్యూనిస్టు షాభీదు కేవలం లొంగిపోవుమనటమే నని ప్రభుత్వ ప్రతినిధులు విమర్శించారు. ప్రభుత్వం ఈ అవమానం భరించటానికి సిద్ధపడి షరతుల నంగీకరించినప్పటికీ ప్రజలు, సైనికులు ఎదురు తిరుగుతారనీ అందువల్ల తాము షరతులు ఆమోదించి కూడా ప్రయోజనం లేదని వారు అన్నారు.

ప్రభుత్వం సంధి షరతులను త్రోసి వేయటానికి అమెరికన్ సామ్రాజ్యవాదులు, సైనాలలో కల్లా పెద్ద బందిపోటు దొంగ అయిన చాంగ్ కైషేక్ ముఖ్య కారకులని నేడు కమ్యూనిస్టు నాయకుడు మావ్ సీటుంగ్ నిందించారు. తాత్కాలిక అధ్యక్షుడు లీసంగ్ జెన్ రాజధానిని వదిలి పెట్టకపోతే, ఉంటే తమ సైన్యాలు దానిని సమీపించి నప్పుడు సంధి షరతులకు సంతకం చేసే అవకాశం ఆయన కివ్వబడుతుందని మావ్ సీటుంగ్ ప్రకటించారు.

### మావ్ ఆదేశం

మావ్ సీటుంగ్ తన సైనికుల కిక్రింది ఆదేశం ఇచ్చారు: "అన్ని రంగాల్లోను ఉన్న కమ్యూనిస్టు సైన్యాలు ధైర్యంగా పోరాడుతూ ముందుకు సాగిపొండి. కొమింటాంగ్ పార్టీకి సంబంధించిన ప్రతిపక్షస్థలన్నిటినీ నిర్మూలించండి. యుద్ధ నేరస్తుల నందరినీ అరెస్టు చేయండి. ప్రాంతీయ ప్రభుత్వసేనానులతోనూ, రాష్ట్రప్రభుత్వాలతోనూ విడివిడిగా వ్యవహరించి సంధి పరిష్కారాలు సాధించండి."

## చాంగ్ కైషేక్ వద్దకు లీసంగ్ ప్రయాణం?

కొమింటాంగ్ ప్రభుత్వ తాత్కాలిక అధ్యక్షుడు లీసంగ్ జెన్, ప్రస్తుతం పదవి నుండి విరమించి ఉన్న మాజీ అధ్యక్షుడు చాంగ్ కై షేక్ సలహా తీసుకునే నిమిత్తం చాంగ్ ఉంటున్న చెంకియాంగ్ రాష్ట్రానికి ఈ వేళ వెళతాడని కొన్ని వార్తలు ప్రచారమవుతున్నవి. కాని ఇవి ఇంకా ధృవపడలేదు.

నాన్కింగ్ ప్రభుత్వానికి చెందిన 5 ప్రధాన నిర్వాహక సంఘాల అధ్యక్షులు సమావేశమై ప్రభుత్వాన్ని దక్షిణ ప్రాంతాలలో ఉన్న కాంటన్‌కు తరలించవలెనని నిర్ణయించిరి.

## 'భక్త రామదాసు'

చెన్నపట్నం, ఏప్రిల్ 21: ఎస్ప్లనేడ్ వై. ఎం. సి. ఎ. ఆంధ్రవిజ్ఞానపరిషత్తువారు, తాము నిర్వహిస్తున్న వయోజన రాత్రి పాఠశాల, పఠనాలయాల సహాయార్థం 23-వ తేదీ శనివారం సాయంకాలం 6 గంటలకు వై. ఎం. సి. ఎ. ఆడిటోరియంలో భక్త రామదాసు నాటకం ప్రదర్శింపనున్నారు.

## రేడియో కార్యక్రమాలు

### వార్తల వేళలు, మీటర్లు

అలిండియా రేడియోనుంచి రోజూ ఉదయం 7.0 గం. కు మధ్యాహ్నం 1-50 గం. కు సాయంకాలం 7-0 గం. కు తెలుగులోనూ, ఉదయం 8-0 గం. కు మధ్యాహ్నం 1-30 గం. కు సాయంకాలం 6-0 గం. కు రాత్రి 9-0 గం. కు ఇంగ్లీషులోనూ వార్తలు, ప్రసారం చేస్తారు. ఈ వార్తలను 211.3, 31.28,3 57.1 మీటర్లలో వినవచ్చు.

ప్రతిరోజూ ఉదయం 8-15 మధ్యాహ్నం 1-40కి మదరాసు (1) లో (2) మధ్యాహ్నం 2-45 మదరాసు భాషలోనూ, సాయంత్రం 7-30 విజయవాడలోనూ ఫిలింపాటలు మొదలైనవి ప్రసారం చేస్తారు.

సాయంత్రం 6-10 మదరాసు, విజయవాడ రెండు కేంద్రాలనుంచీ స్థానిక వార్తలు, ధరలువగైరా ప్రకటిస్తారు.

హైదరాబాద్ రేడియో కార్యక్రమాలు 411.0 మీటర్లలో వినిపిస్తాయి ఆలిండియా రేడియో ప్రసారంచేసే ఇంగ్లీషు, హిందీ, తెలుగువార్తలు ఈ కేంద్రంద్వారాకూడా వినవచ్చు. ఐతే ప్రొద్దున్న 7 గంటలకు వుండే తెలుగు వార్తలు ఈ కేంద్రంద్వారా వినిపించవు. పోతే, ప్రొద్దున 8-15 కి, రాత్రి 8-25 కి ఇంగ్లీషులోనూ; రాత్రి 9-40 కి హిందూస్తానీలోనూ హైదరాబాద్ స్థానికవార్తలు ప్రసారంచేస్తారు. ఉదయము 8-50కి తెలుగులో వార్తలు ప్రసారంచేస్తారు. సాయంకాలం 6-50 కి ఇంగ్లీషు, హిందూస్తానీలలో స్థానిక ప్రకటనలు ప్రసారం చేస్తారు.

## సంగీతాది కాలక్షేపాలు, ప్రసంగాలు మొదలైనవి

### ఏప్రిల్ 24 వ తేదీ

మద్రాసు (1): ఉదయం 7-30 నూర్జహాన్, సురయ్యా, సైగాల్ ప్రభృతుల పాటల రికార్డులు. మధ్యాహ్నం 1-0 ఎన్. రాజలక్ష్మి గాత్రం. 3-0 'షేహ్నాయ్' ఫిలిం సాయంత్రం 4-0 ఎస్ సి. వసంతకోకిలం పాటల రికార్డులు. 5-30 టి. ఎస్. రామచంద్రన్ గాత్రం. 6-15 వై. దేవకి గాత్రం. 6-45 టి. పి. రాజగోపాలన్ గాత్రం. 7-30 కె. సి. డే పాటల రికార్డులు.

## కెన్నెత్ రాయల్ రాజీనామా

వాషింగ్టన్, ఏప్రిల్ 21: అమెరికా సైనికశాఖా కార్యదర్శి పదవికి కెన్నెత్ రాయల్ రాజీనామా నిచ్చినట్లు నేటి రాత్రి ట్రూమన్ అధ్యక్షుడు ప్రకటించెను.

మద్రాసు (2): ఉదయం 7-15 టి. ఎన్. విజయలక్ష్మి, వసుంధరల పాటల రికార్డులు. 9-0 వివిధ వాద్యాలు మధ్యాహ్నం 2-15 ఆటవిడుపు పిల్లల కార్యక్రమం. న్యాయపతి రాఘవరావు గారి నిర్వహణ. సాయంత్రం 6-30 నుంచి 7, 7-15 నుంచి 7-30, గ్రామసుల కార్యక్రమం, 'చంద్రలేఖ' రికార్డులతో కూర్చిన రూపకం. 7-45 'పంజి తెర' అనే శీర్షిక ను ఎస్. అన్నపూర్ణాదేవి గారిచే ఫిలిం సమీక్ష. రాత్రి 8-30 కేశవమూర్తి సైలన్ 9-30 హీరాబాయి బరోడ్కర్ పాటల రికార్డులు. 9.40 వి. రామరత్నం గాత్రం 10-10 ఫిలిం పాటలు.

విజయవాడ: ఉదయం 7-15 కి విలయ విద్యాంసుల వాద్యగోష్ఠి, 7-30 'వినువీధి' అనే శీర్షికను పలురుచుల ప్రోగ్రాము. 'తండ్రిదగ్గర చదువు' అనే నాటిక. అనుభాగము అనే కథ. 8-15 శ్రోతలు కోరిన రికార్డులు. సాయంకాలం 5-30 శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి వీణ 6-20గీతామంజరి. 6-30 గ్రామసుల కార్యక్రమం. మద్రాసునుంచి రిలే. 7-30 శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి వీణ. 7-45 చిత్రవాణి. 8-0 ఎం. బాలమురళీకృష్ణ గాత్రం. రాత్రి 9-15 టి. ఎస్. రాజరత్నం నాగస్వరం. 9-30 చిత్రవాణి.

హైదరాబాదు: ఉ. 8-20 గొహ్రాబాయి ఖయాల్ జాన్‌పురి. 8.35 అబ్దుల్ అజీజ్ ఖయాల్, గీత్. 9-15 ప్రేమగీతం. మ. 12-30 'బంధన్' పాటల రికార్డులు. 1 00 జాతీయగీతాలు. 1-20 పారిశ్రామిక కార్మికులకు తెలుగులో ప్రసంగం. సా. 5-0 నుంచి 5-40 వరకు భజనలు, గీతాలు వగైరా. 6-0 మరాఠీ కార్యక్రమం. 6-30 పట్నవాస్తవ్యుల తెలుగు కార్యక్రమం. కుంకుమరేఖలు. చిన్నకథ, 7-15 గ్రామస్థుల తెలుగు కార్యక్రమం. ఆహారసమస్య సందర్భంలో వ్యవసాయక శాసనాలు గురించి రామచంద్రరావు ప్రసంగం. 7-45 బాలుర మన ప్రత్యేమ అనేశీర్షికను 'విద్యాభ్యాసంలో స్వేచ్ఛ' ను గురించి క. వేదాంతాచారి ప్రసంగం.

## మదరాసు ధరలు

మదరాసు, ఏప్రిల్ :2 :

వేరుసెనగ: (581 పౌ 1-కి ఎప్పు రోస్తాగిడ్డంగులు) మెషీన్ (సేల్సుటాక్సుతో సహా) బజారు (కొత్తది) రు. 170, 171

వేరుసెనగనూనె ఎక్సుపెల్లర్ (గ్యారంటీ) (సేల్సుటాక్సుతో సహా) రు. 340-0-0

ఆముదం బజారుడెలివరీ ఎక్సుపెల్లర్ ఇంగ్లీషుకాండి 500 పౌనులు గలది

| | |
|---|---|
| మొదటి రకం | రు. 360-0-0 |
| రెండవ రకం | రు. 310, 345 |
| కొంకాయనూనె (39 పౌను గల డబ్బా) ఒకటికి | రు. 38-2-9 |

బంగారు - వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు వరకు 1-కి ఎప్పర్డు బొమ్మ సేల్సుటాక్సుతో సహా రు. 74-8-0 పెట్లా బంగారు తులం 113-8-0 మూసబంగారు 112-0-0 సీమవెండి తులం 100-కి (రెడీ) 180-8-0 వెండి తులం 1 కి 1-13-0.

### పంచదార

| | |
|---|---|
| "కాన్పూరు" (2 అందరు) | రు 90-4-0 |
| అనకాపల్లి" (2 అందరు) | 89-0-0 |

## న్యూయార్కు దూది

న్యూయార్కు, ఏప్రిల్ 21.

మే 33.01/33.02 జూలై 32.20/32.22 అక్టోబర్ 29.02/29.02 డిశంబరు 28.79/నా. మార్చి 28.58/నా. మే 28.50/28.50 జూలై 27.55/27.55 అక్టోబర్ 25 55/25.55.

| | |
|---|---|
| మిడ్లింగ్ హాజరు | 34.01 |
| మే (గరిష్టధర) | 32.22 |
| (కనిష్టధర) | 32.14 |

### మే వాయిదా ధరలు

| | | |
|---|---|---|
| నేటి ప్రారంభం | వెల | 32.16 |
| నిన్న | | 32.19 |
| ,, ముగింపు | వెల | 32.20 |
| నిన్న | | 32 19 |

## విజయవాడ

విజయవాడ, ఏప్రిల్ 21:

(ముగింపుధర-సాయం 6 గం|| లకు)

బులియను-బంగారం-పెట్లా

| | |
|---|---|
| తులం 1 కి | రు 114-0-0 |
| ,, ,, మూసా | రు 113-0-0 |
| ,, ,, సావరిను | రు 75-4-0 |
| వెండి 100 తులాలు | రు 181-8-0 |
| ,, తులం 1 కి | రు 1-13-6 |

వేరుశనగపప్పు-175 పౌనుల

| | |
|---|---|
| బస్తా-పేశవారీ (సంచీకాక) | రు 57-4-0 |
| ,, ,, స్పెషల్ రకం | రు 56-4-0 |

వేరుశనగనూనె-26 పౌనుల

| | |
|---|---|
| మణుగు తయారు | రు 15-10-0 |
| ,, ,, మే వాయిదా | రు 15-12-0 |
| ,, ,, జూన్ వాయిదా | రు 16-12-0 |

వేరుశనగ పిట్టు-165 పౌనుల

| | |
|---|---|
| బస్తా (సంచీకాక) తయారు | రు 13-12-0 |
| ,, ,, మే వాయిదా | రు 14-12-0 |

(నేడు ఎండ వేడిమి 105°)

## రైళ్ల వేళలు

1949 ఏప్రిల్ 1 వ తేదీ నుంచి మదరాసు సెంట్రలు స్టేషనులో అమలులో వున్న రైళ్లవేళలు :

### మద్రాస్ సెంట్రల్

| | రాక | పోక |
|---|---|---|
| కలకత్తా మెయిలు | ఉ 8- 5 | సా 6-15 |
| ఢిల్లీ ఎక్స్‌ప్రెస్ | సా 5-5 | ఉ 10-5 |
| విశాఖపట్నం. | | |
| ప్యాసింజరు | రా 8-25 | సా 7-30 |
| కర్ధా ప్యాసింజరు | మ 11-30 | ఉ 8-10 |
| చిట్టగుంట ,, | మ 3-20 | మ 12-40 |
| బొంబాయి మెయిలు | ఉ 5-50 | రా 8-50 |
| ,, ఎక్స్‌ప్రెస్ | సా 7-25 | ఉ 7-1 |
| రాయపూరు | | |
| ప్యాసెంజరు | సా 5-55 | ఉ 8-45 |
| రేణిగుంట ప్యాసింజరు | ఉ 9-48 | సా 5-55 |
| ,, ,, | రా 9-30 | — |
| ఆర్కోణం ,, | | సా 6-32 — |
| బెంగుళూరు మెయిలు | ఉ 6-5 | రా 9-15 |
| ,, ఎక్స్‌ప్రెస్ | మ 3-40 | మ 12-50 |
| బెంగుళూరు ప్యా|| | రా 8-35 | ఉ 6-40 |
| ,, ,, | ఉ 5-35 | రా 9-20 |
| జాలార్పేట ,, | మ 1-20 | మ 11-03 |
| కొచిన్ ఎక్స్‌ప్రెస్ | ఉ 9-5 | సా 5-30 |
| బెంగుళూరు ,, | ఉ 7-30 | సా 7-15 |
| నీలగిరి ఎక్స్‌ప్రెస్ | ఉ 7-10 | రా 8-10 |



## కథా సంగ్రహము

చిరకాలముగా పుత్రభాగ్యము లేని చేరంబురాజు, ఈశ్వరాను గ్రహమున పవళక్కొడి అను పుత్రికను బడసెను: అంగము బల పరాక్రమముల అవతారమైన పవళ రాజకుమారి స్త్రీలరాజ్యాన్ని స్థాపించెను.

పులింధీనుడు అల్లికుమారుడు: పవళరథముకావలెననికోరుతాడు: అర్జునుడు తప్ప మరెవరు పవళ రథమును తేలేరని అల్లికి తెలియును. అల్లి, తన్ను మరచి పోయిన అర్జునుని యెడల తీవ్రమైన కోపముకలిగి ఉండినప్పటికి, నిద్రాహారములు లేకయున్న తన కుమారునియెడల జాలిగలిగి, జబ్బుతోనున్న పులింధీనుని వచ్చిచూడమని అర్జునునకు ఉత్తరము వ్రాయును. తన కుమారుని చూచుటకు వచ్చిన అర్జునుని కనినంతనే అల్లికి కోపం గలుగుతుంది. శ్రీ కృష్ణుడు వారిరువురకు సమాధానము కలుగ చేయును.

పులింధీనుని కోరికను నెరవేర్చుటకు, శ్రీ కృష్ణుని సహాయముతో అర్జునుడు పవళ వనమును చేరును. అచ్చట వారిరువురు స్త్రీవేషముపూని పవళక్కొడి రాజభవనములో ప్రవేశిస్తారు. అచ్చట అర్జునుని పరిహాసించు నాటకములో పాల్గొనియుండు పవళక్కొడి రాజకుమారిని చూచి అర్జునుడు ఆమెను పెండ్లాడ తలంచును. ఆమెను పెండ్లాడుటకు శ్రీ కృష్ణుని సహాయమును కోరుతాడు.

అర్జునుని కోరికను నెరవేర్చుటకు శ్రీ కృష్ణుడు సమ్మతిస్తాడు.

పవళక్కొడి వేటకు వెళ్లు సమయమున శ్రీ కృష్ణుడు ఒక వేటగాడి వేషమున, అర్జునుని ఒక హంసగా మార్చి, పవళక్కొడి వద్దకు తీసుకొనివస్తాడు. పవళక్కొడి ఆ హంస అందమును చూచి చాల సంతోషించి దానిని తన కిమ్మని అడుగుతుంది. కావలసినప్పుడు హంసను మరల యిచ్చు షరతుతో దానిని పవళక్కొడికి వేటగాడు ఇస్తాడు. హంసను తీసుకొనివెళ్లి పవళక్కొడి తనవద్ద ఉంచుకొంటుంది. ఆ దినం రాత్రి హంసరూపముతోనున్న అర్జునుడు తన స్వస్వరూపము దాల్చి రాజకుమారికి తన కోరికను తెలుపుతాడు హంస రహస్యమును తెలుసుకొనక మోసపోయినందుకు పవళక్కొడికి అవమానము కోపము గల్గుతుంది. ఆమె పరమేశ్వరుని ధ్యానిస్తుంది. ఈశ్వరుడు ప్రత్యక్షమై వారిరువురికి వివాహము చేయించి ఆశీర్వదిస్తాడు.

పవళక్కొడిని పెండ్లి చేసుకొని అర్జునుడు ఆనంద సాగరములో మునిగిపోతాడు. అల్లిని పూర్తిగా మరచిపోతాడు. రథమును తీసుకొనివచ్చుటకుగాను వెళ్ళిన అర్జునుడు తిరిగిరానందుకు అల్లికోపగించి పవళరాజ్యముమీదికి దండెత్తుతుంది. అర్జునునకు ఏమి చేయుటకు తోచదు. ఆ సమయములో శ్రీ కృష్ణుని ఉపాయముతో అల్లికి పవళక్కొడికి సమాధానము కుదురుతుంది. పులింధీరునకు పవళరథము లభిస్తుంది.